ప్రథమముద్రణ
ఫిబ్రవరి 1980



వెల రు. 6-00

పబ్లిషర్స్:
సమతా సాహితి
3-4-705/5
నారాయణగుడా.
హైదరాబాదు-500 027

ముద్రణ :
వెంకట్రామ పేపర్ ప్రొడక్ట్సు ప్రైవేట్ లిమిటెడ్
నారాయణగుడా హైదరాబాదు

కృతి స్వీకర్త

శ్రీ

మాచేటి రామప్ప



చిత్తౌన్నత్యము, నిర్భయత్వమును, ఉచ్ఛీర్షత్వమున్, ధీరతా
వృత్తమ్మున్, భవితవ్యవర్తనములై స్వేచ్ఛా ఋజుత్వమ్ములున్
చిత్తాభోగములైన దానగుణ దాక్షిణ్యాలు రామప్పలో
పొత్తుల్ గట్టి వసించు తద్హృదయ సంఫుల్ల ప్రసూనమ్ములై

పేదతనమ్ము, బంధువుల బీదతనమ్ము, సవర్ణులన్ కులో
న్మాదము, చుట్టుపట్లగల మహ్మదుజాతిని గాఢమౌ మతో
న్మాదము, పిన్ననాడె మనమందుగలంప సహింపరాని ని
ర్వేదము పొంది, అజ్ఞతకు విద్యయె మందని నేర్చె రేబవల్

అన్నము నీరమున్ మఱచి ఆదట సాధనచేసి పొందె సు
స్వన్నతకున్ ఫలంబులగు విశ్వకళా పరిషత్ పరీక్ష లం
దున్నతమైన శ్రేణియు, సమున్నతమైన ప్రభుత్వ సుస్థితిన్
నున్నతమౌ కళత్రము, ప్రశస్తుల పుత్రుల, బంధుమిత్రులన్.

# నా మాట

ఈనాటికి నావి చాలానవలలూ, చాలా నాటికలూ గ్రంథ రూపంలోబయటికివచ్చాయి. కాని కవితాసంపుటాలు అచ్చేరాలేదు. ఇదివరలే నవసృష్టి, అనేకావ్యాన్ని వెలువరించడంజరిగింది. సంఘ సంస్కర్త జాగర్లమూడివీరాస్వామిగారికి అంకితమీయడం జరిగింది. సహృదయులనుండి మెప్పులు పొందడమే గాక, పత్రికల లోనూ, ఆకాశవాణిలోనూ సద్విమర్శకుల సంభావన పొందింది.

వచన కవిత్వం గూడా బాగా వుంటుంది. కాని మాత్రా బద్ధ కవిత్వమంటే నాకిష్టం. అందుకే గేయరచనకు ప్రాధాన్యం యిస్తాను. గేయంకూడా ఛందోబద్ధమే, లయబద్ధమే. సాధారణంగా యతిప్రాసలతో సుందరమై వుంటుంది.

గేయకవిత్వం వ్రాయడం కష్టమైనదే. ఎందుకంటే వ్యావహారిక భాషలో సాధారణంగా వర్తమాన సమస్యలపై- పండిత పామరులకు గూడా సుబోధకంగా ఉండేటట్లు వ్రాయాలిగాబట్టి. సూటిగా చెప్పాలిగాబట్టి. అంతేగాదు, చిన్నచిన్న పాదాలు గలిగి వుండి యతిప్రాసమండితమై వుండాలంటే ఎంతోకష్టంగదా! అంతే గాదు. సార్థకపదప్రయోగం, సంగీతయుక్త అక్షర ప్రయోగం ఓజోమాధుర్య ప్రసాదాది గుణప్రయుక్తం, అలంకార మండనం యివన్నీ ఉండాలంటే కష్టమైన పనే!

పద్యకవిత నాకు చాలాయిష్టం. అదిగణబద్ధమూ లయాన్వితమూగాఁబట్టి. సంస్కృతపద్యాల (శ్లోకాల) కంటే తెలుగు పద్యాలు వ్రాయడం కష్టం అదిమన పూర్వ కవి లాక్షణికులు సృష్టించుకొన్న కష్టం. గణాలతోపాటు ప్రతిపాదంలోనూ యతి ప్రాసలుండాలి. యీపద్ధతి ఏ యితర భాషల్లోనూ లేదు. కన్నడంలో ఒక ప్రాసమాత్రం వున్నది. తెనుగు కవిత్వంలోని పద్యాలలో వుండే యీయతిప్రాసలు పద్యం నడకకు అడుగడుగునా అడ్డం తగులుతూ వుంటాయి. వీటి దెబ్బకే, గణపూరణకోసమని గుణహీనమైన పడికట్టురాళ్లను ప్రయోగించేవారు పూర్వ కవులు సైతం. కాబట్టి పద్యరచన కష్టమైనదని తేలింది. యతిప్రాసలు చూచుకుంటూనే సార్థకపద ప్రయోగం చెయ్యడం చాలా కష్టమైనపని. ఆపని కేవలం పండితకవులే చేయగలరు: భాషలో పాండిత్యం లేనివారు అసలు పద్యం జోలికేపోరు.

పూర్వ సంస్కృత నాటకాల్లో శ్లోకాలున్నట్టుగా, తెలుగు నాటకాల్లో పద్యాలుంటాయి. అన్నిటికీ రాగాలుంటాయి, అవిగూడా రసానుగుణంగా వుంటాయి. పద్యాలను రాగయుక్తంగా పాడుతూ వుంటే వినడానికెంత మధురంగా వుంటుందో అందరికీ తెలిసిన విషయమే. ఆ శ్రావ్యతకు కారణం యతిప్రాసాదులే.

ఇదంతా యెందుకంటున్నానంటే, పద్యరచనపై గల నా మోజు వ్యక్తిగతంగాదనీ, అసలు పద్యరచనలోనే ఆ గుణం వుందనీ చెప్పడానికే. అందుకే పద్యరచన చేస్తున్నాను.

ఈనాడయితే అందర్నీ కవులంటున్నారుగాని, పూర్వం పద్యాలు వ్రాసిన వాణ్ణే కవి అనేవాళ్లు. గేయరూపంలో, పద కవితా రూపంలో, వచనకవితా రూపంలో పూర్వం కొంతమంది కవులు వ్రాయకపోలేదు. కాని. వారిని కవులనలేదు. మనకు జాన పద సాహిత్యం యెంతైనా వున్నది. అదంతా గేయపద కవితల రూపంలో వుంది. వాటికి కవిత్వాలుగా పేరులేదు. పాటలూ, సుద్దులూ అని అన్నారంతే! తాళ్లపాక అన్నమయ్యా పెద తిరు మలయ్యా మొదలయిన వారి పదకవితలను సంకీర్తనలన్నారు. త్యాగయ్య సంగీత కవిత్వాన్ని కీర్తనలన్నారు. ఎందుకంటే వాటిల్లో అత్యధిక భాగం పొండిటీ స్ఫోరకాలు గావుగాబట్టి.

నా చిన్నప్పుడు (1930 ప్రాంతంలో) బోర్డు పాఠశాల లుండేవి. అవిగూడా పెద్దగ్రామాల్లో తప్పచిన్న గ్రామాల్లో వుండేవి గావు. విద్యావ్యాప్తి కొంచెం కొంచెంగా సాగుతున్న రోజులవి. మా వెంకటరాజుపల్లి చిన్నగ్రామం. అందులో బోర్డువారు స్కూలు పెట్టలేదు గ్రామవాసులు ప్రైవేటుస్కూలు పెట్టించారు.

ఈనాటి పద్ధతుల కంటే ఆనాటి పద్ధతులే బాగుండేవి మంచి పునాదులు పడేవి. ఎలిమెంటరీ స్కూళ్లలో యీనాడు సరైన చదువులు లేవు. బోధించేతీరు కూడా బాగాలేదు. ఆ రోజుల్లో మూడవక్లాసుకు వచ్చేటప్పటికే, విద్యార్థులందరికీ అమరమూ, ఆంధ్రనామ సంగ్రహమూ, చాలాభాగం కంఠపాఠం వచ్చేవి. ఎంతెంత కఠిన పదాలైనా తప్పులేకుండా వ్రాసేదక్షత వచ్చేది. అక్షరాలను గుండ్రంగా వ్రాయలేకపోతే అయ్యవార్లు చంపేసే

వారు. మూడోక్లాసు రాగానే పుస్తకం చెప్పించేవాళ్లు. అంటే— ఆదిపర్వమో ఉత్తరరామాయణమో చదివించే వారన్నమాట. అర్థంతో సహాచెప్పేవాళ్లు. పద్యం చదవడమూ అర్థం చేసికోవడమూ అలవాటయ్యేది.

అట్లాంటిది నాచదువు నేను 1939లో3వ ఫారంలోచేరాను అప్పటికే అమరమూ, ఆంధ్రనామసంగ్రహమూ చాలాభాగం కంఠ. పాఠం. ధనంజయ నిఘంటువు కొంత కంఠపాఠం. శ్రీకృష్ణ కర్ణామృతంలోని కొన్ని శ్లోకాలు కంఠపాఠం. భారత, భాగవత పద్యాలు మంచివి కొన్ని కంఠపాఠం. ఆ పునాదులతో హైస్కూలులోగాని, తర్వాత కాలేజీల్లోగానీ, తెలుగు పాఠ్యభాగాలుగా ఉన్న పద్యాలన్నీ తప్పనిసరిగా కంఠపాఠం చేసేవాణ్ణి.

తెలుగుఆనర్సులో ఉన్నప్పుడు చాలాచాలా ప్రబంధాలు విమర్శతోపాటు చదువుకొన్నాను. ఆంధ్రోపన్యాసకుణ్ణి అయ్యాక బోధించే పాఠ్యాంశంలోని పద్యాలు కంఠపాఠం అయిపోయ్యేవి. వీర రసంతోకూడిన ఓజఃపూర్ణ పద్యాలు తప్పని సరిగా కంఠపాఠం చేసేవాణ్ణి.

నేను 1943-45 మధ్య అనంతపురం కళాశాలలో ఇంటర్మీడియట్ చదివేరోజుల్లో ప్రముఖ విమర్శకుడు డాక్టర్ చిలుకూరి నారాయణరావుగారు మాకు ఆంధ్రోపన్యాసకులుగా ఉండేవారు. కార్యమపూడి రాజమన్నారుగారు సీనియర్ పండిట్‌గా ఉండేవారు. నేను పద్యాలు వ్రాసికొనిపోతే చదివి ప్రోత్సహించేవారు. డాక్టర్ చిలుకూరి నా పద్యాలలోని యతిప్రాసల లోపాలు

చూపి యతులగూర్చి ఒక పాఠం చెప్పి అది వ్రాసి ఇచ్చారు. అంతే తర్వాత తప్పులు వ్రాయలేదు. 1944లో నేను వ్రాసిన ప్రేమభిక్ష అనే నవలను శ్రీరాముడికి అంకితం ఇస్తూ (చాలామంది లాగా నేను కావ్యనాయకుడైన రాముణ్ణి దేవుడనుకొనే వాణ్ణి. అప్పట్లో) పద్యం వ్రాశాను అదీ ఇది:

"ఓ రఘువంశపావన! మహోజ్జ్వలమూర్తి! సురద్విషారి! యం
భోరుహ పత్రనేత్ర! నను బ్రోచి శుభమ్ముల నీయవేడెదో
శూర! భవత్పదాంబుజ విశుద్ధములంటి నుతింతు వేడ్కతో
కూరిమి నా ప్రయత్నముల గోరికలన్ సఫలమ్ము సేయవే!"

పై అంకిత పద్యానికి ముందు సూర్యోదయము అన్న శీర్షికతో ఒక కవిత వ్రాశాను.

"కొక్కొరోకో యనుచు గూయ కుక్కుటములు
పొలములకు పదపదటంచు హాలములగొని
హాలికులు తమ భూములకరుగుచుండ
అండజమ్ములు తమతమ ఆలయముల
వీడి బిడ్డల మేతకై వేగ బరవ
..............................
..............................
పూర్వదిక్కాంత హృద్యంపు పుష్కరమ్ము
పుల్లమయ్యెను మోముప్రపుల్లమయ్యె
నాగ నధరముల్ విప్పుచు నవ్వినట్లు
అల్లనల్లన బల్లున తెల్లవారె"

"పూర్వదిశావధూటి తనముంగిట వెంగున గంతులెత్తుచున్
గర్వము పైకొనన్ వరశిఖావళులాడెడి నృత్యసంపదల్
బర్వముగాగ జూడ తన పాణి తలమ్మున పెద్దదియ్యతో
బర్విడెనోయనంగ నట భానుడుదోచెను తూర్పుకొండపై"

పైది వర్ణనాత్మక కవిత్వం - వర్ణించేవాడే కవి అనిగదా వ్యుత్పత్తి.

ఉపమలు కవిత్వపు సొంపును సమధికం చేయడానికి ఉపకరిస్తాయి. ఉత్ప్రేక్షలు సొగసుతోపాటు భావసంపదను ఇనుమడింపచేస్తాయి. వర్ణనలో ఉత్ప్రేక్షనువాడడంఅందుకే. నాకు ఉత్ప్రేక్ష అంటే చాలా మక్కువ. అందుకే నాటి కవిత్వంలో గూడా ఉపమా ఉత్ప్రేక్షలకంత స్థానమివ్వడం జరిగింది. అంతేగాక నాకు అక్షర రమ్యత పైన- అదిగూడా సార్ధకతకు లోబడే - చాలా ఇష్టం.

ఆ రోజుల్లోనే - అంటే - ఇంటర్మీడియట్ రోజుల్లోనే చిన్నకావ్యం వ్రాయడానికి తలపెట్టాను. యువకవులు ప్రేమ భావాన్ని, ఆదర్శ భావాలనూ ప్రకటించడానికే ప్రయత్నిస్తారు. అట్లాగే నేను ఒక ఆదర్శాత్మక ప్రేమకావ్యాన్ని మొదలుపెట్టాను. దాన్ని పూర్తిచేయలేదు, అదిట్లా ప్రారంభమవుతుంది :

"పరగ మా యూరియందొక పసిడిబొమ్మ
నా బరగుచుండు చక్కని నాతి గలదు
సాధు చారిత్ర యాతన్వి సాధుబుద్ధి
దాని చరితము నిట వ్రాయబూనినాను.

మా పక్కఁ బమ్మున మాయింటి కెదురుగ
వెలయు నా చిలుకలకొలికి గృహము
మా పాఠశాలలో మా కక్ష్య యందున
చేరి చదువుచునుండె చిగురుబోడి
మాతల్లి తనతల్లి మానాన్న తననాన్న
అన్యోన్యమైత్రిచే నలరుచుండ
అనుదినమ్మును నేను అనుజులతో గూడి
దాని యనుజులతోడ తగవు లాడు

చుందు మక్కన్య గూడ నా సోదరియగు
కుముదవతితోడ నెప్పుడు గ్రుద్దులాడు
దానికై మాదు పెద్దలుగాని దాని
పెద్దలునుగాని యెప్పుడు బ్రేలలేదు.

ప్రతిదినమ్మును నేను మా పాఠశాల
కేగు నప్పుడు ఇంటికి నేగుదేరు
చుండు నప్పుడుగాని యా సుందరాంగి
నన్ను చూచిన మెల్లగ నవ్వుచునును

X X X

తరువాత కొంతకాలము
జరిగెను నే శాస్త్రములను చదువగ వేరే
పురమున కరిగితి తదుపరి
చిరపరిచితమైన యట్టి చేతిగ్రాతన్

తెలిపెడి యుత్తర మొక్కటి
చెలికాడౌసగంగ నపుడ చించితి హాహా
తెలుపగ శక్యమె నావ్యథ
చెలి వ్రాసిన విధము జూడ చిత్తముసెదరెన్

ఓ రామ శేఖర ! ఓ నా మనోహర
జనము రక్షింపు రాక్షసుల నుండి
నీ వేగు నప్పుడు నిన్ను తప్పక పెండ్లి
యాడెదనంటివి నేడు నన్ను
వేరొక్కనికి నిచ్చి పెండిలి గావింప
సాక్షితాంబూలంబు జరిపినారు
భానువారము నాడు మీనలగ్నమునందు
జరుగును పెండిలి జరిగితీరు

ఎంత యత్నించినన్ గూడ నుంతయైన
కరుణలేకను మావారు ఖండితముగ
ఆయనకె యిచ్చి పెండిలి సేయుదురట
అయయొ నేనెట్లు బ్రదుకు దీ యవనిపైన

చదివి జాబును మరికొన్ని సార్లుచదివి
తలబరువు లెక్క యోజించి తలను త్రిప్పి
ఓర్పుగా జూచి ఒక్క నిట్టూర్పు విడిచి
ఉత్తరమ్మును వ్రాసితా యువిద కిట్లు"

అంతే ! తర్వాత ఉత్తరాన్ని పూర్తి చేయనూ లేదు - కథను సాగించనూ లేదు.

తరువాత ఒక చిన్న ఖండకావ్యం రాశాను. అది గీత మాలిక. పసిపిల్లలకు పెండ్లిచేసి భర్త చచ్చిపోతే జుట్టు గొరిగించి గాజులు పగలగొట్టించాలని అందరూ నీలాటి రేవుకడ ప్రయత్నం చేస్తూవుంటే మిత్రులతో కలసి ప్రకృతి దృశ్యాలు చూడడానికి వెళ్లిన కథానాయకుడు అదిచూచి అడ్డువచ్చి వాళ్ల కుద్బోధచేసి కరుణ చిప్పిల్లే ఉదాహరణలు చెప్పి సంఘ సంస్కరణ భావాలను ప్రబోధించి ఆ ప్రయత్నం నుండి విరమింపచేశాడు. తరువాత కథానాయకుడు ఆపిల్లను పెళ్ళిచేసికొంటాడో లేదో గాని పుస్తకం ఆగిపోయింది. ఇంత వరకూ బయట పడనూ లేదు.

1945 వేసవిలో మా గ్రామంలోనే ఒక సాయంకాలం పొలాల్లోకి షికారు వెళ్ళినపుడు మా బావతో కలసి కూర్చొని ప్రకృతి దృశ్యాలు తిలకిస్తూ ఆనందిస్తున్నాను. అంతలో ఆయనకు ముఖ్యమైన ఒకమ్మాయి గడ్డికోసం అట్లా వచ్చింది. పద్యం వ్రాస్తావా కవివావా అన్నాడు. అంతే.

"తెల్లని రవికయు తెల్లని చీరయు
నల్లని మేనుపై నలరుచుండ
వాలారు జడ యెంతొ వాలాయముగ దాని
వెన్నుపై జీరాడి వేడ్కకూర్ప"...

అంటూ ఆశువుగా కొన్ని పద్యాల కావ్యాన్ని పూర్తి చేశాను.

అంతే! పద్యరచన తర్వాత సాగించలేదు. కవితా రచన చేయడంలో నా దృష్టి మారడమే దీనికి కారణం. సంఘ సంస్కరణే నా ప్రధాన ఆశయమూ, ఆదర్శమూను. అప్పటికి నేను వ్రాసిన కవితలో గూడా కులనిర్మూలన భావాలు - అస్పృశ్యతా నివారణ - కులాంతర వివాహాలు - మూఢాచార వైముఖ్యము - ఎక్కువగా చోటుచేసికొనేవి. ఈ భావాలు పద్యాల్లో చెప్పడం కంటె నవలల రూపంలో-వ్యావహారిక భాషలో అందిస్తే సామాన్య జనులకు సుబోధక మవుతుందని భావించాను. అదే నవలా రచనకు ప్రారంభం. మొదటి నవల 1944 ఆఖర్లో పూర్తిచేశాను. అదే ప్రేమబిక్ష ఇది గూడా కులాంతర వివాహాన్నిగూర్చిచెప్పేదే. రెండు ముద్రణలు పొందింది గానీ ఇప్పుడు లేదు. ప్రస్తుతం నాదగ్గర విత్తనరూపంలో గూడా కాపీలేదు. ఆతర్వాత రెండు నవలలు వ్రాశాను. అవి ఇప్పటికీ ముద్రణ పొందలేదు స్థాయి తక్కువ అన్న భావంతో ముద్రణకియ్యలేదు. వాటిల్లో కూడా సంఘ సంస్కరణభావాలే. తర్వాత వాత్తెరులో ఆనర్సు మొదటి సంవత్సరంలో (1946) 'ఆదర్శం' నవలను వ్రాశాను. అది అధికంగా అస్పృశ్యతా నివారణ, కులాంతర వివాహాలూ గూర్చి వ్రాసిందే. దానికి పేరు వచ్చింది. ఉన్నవ వారి 'మాలపల్లి' తర్వాత చెప్పుకోదగ్గది అని సహృదయులు పత్రికలద్వారా పేర్కొన్నారు. సంఘ సంస్కరణ భావాలతోటే ఆ తర్వాత

'భావం' వంటి నవలలూ, నాటకాలూ, పిల్లల నవలలూ అనేకం వ్రాయడం జరిగింది.

కాని నాలో వుండే కవి అప్పుడప్పుడు నేనున్నానంటూనే వున్నాడు. భావోద్రేకం కలిగినప్పుడు భావ తీవ్రతకు అనుగుణంగా రచన జరగాలంటే, మంచి నడకతో ఉండే పద్యమే రావాలి. నేను రాజమండ్రి కాలేజిలో (1949-53) ఉపన్యాసకునిగా ఉన్నప్పుడు 'ముక్తికాంత' అన్న శీర్షికతో కొన్ని పద్యాలు వ్రాశాను. అప్పటికి నేను అవివాహితుణ్ణి. అయినా, ముక్తికాంతను కామించే మనఃస్థితి ఉండేది. ఆ తర్వాత కూడా అప్పుడప్పుడు పద్యాలు వ్రాస్తూ వచ్చాను కానీ, కంఠపాఠం లేవు, ఇంటర్మీడియట్ రోజుల్లో పద్యాల్లాగా.

పద్యకవితకంటె గేయకవితే సులభగ్రాహ్యంగా వుంటుందన్న భావంతో గేయకవితను ఎక్కువగా ఆశ్రయించాను. ఆ తర్వాత, అప్పుడప్పుడూ మిత్రులకోసం, పెళ్ళిళ్ళు చేసికొంటున్న మిత్రులకోసం ఎడనెడా పద్యాలు వ్రాశాను కానీ, కావ్యఖండికలు వ్రాయలేదు. ఇటీవల తుఫానులు విజృంభించి, తూర్పుకోస్తాను ధ్వసం చేసినపుడు నాలోని కవి మళ్ళీ ఒకసారి తుఫానులా విజృంభించాడు అదే 'కంకాళరాత్రి' కావ్యానికి నాంది.

పద్యరచనలో పరగన్, ఒనరన్, బలెన్. పోలన్, చూడగా, ఇలన్, ఈ భూమిలో ఇట్లాంటి పడికట్టు రాళ్ళు వేయడమంటే నాకు మంట. అయితే మహా కవులనిపించుకొన్నవారే ఆ విధంగా చేశారు. గణాలకోసం వచ్చిన బెడద అది. అక్షరాన్నిగానీ

పదాన్నిగానీ అర్థవంతమైందిగా వుంటేనే ప్రయోగించాలని నా నిర్ణయం. నిరాటంకంగా సాగే భావాన్ని అనుగమించగల అక్షరాలనే-పదాలనే-ప్రయోగిస్తాను. వర్ణిత వస్తువుయొక్క స్వరూప స్వభావాలను సూచించే పదాలను ప్రయోగించడం ఒక గొప్పకళ. భావంతో భాషనుమేళవించి కమ్మచ్చులోపెట్టి లాగినట్లుగా సాగితేనే నాకుతృప్తి. నడక ఎక్కడా నట్టినట్టుండగూడదు. తెలుగు ఛందస్సులో నియతగణాల వరుస ఉండదు. కాబట్టి అక్కడక్కడ నట్టినట్టు కనిపించడానికి అవకాశమేర్పడుతుంది. అయితే అలాటి అవకాశం ఇవ్వకుండా, ఒక ప్రత్యేకమైన నడకబాణీని ఏర్పరచుకొని రచనను నిర్వహిస్తే సొంపుగా ఉంటుంది. ఈ సొంపును తేవడానికే ప్రయత్నించాను. పద్యరచనపట్ల నాకున్న అభిప్రాయాలను, ఈ కంకాళరాత్రి రచనలో ఎక్కడికక్కడ పొందుపరచాను. వాటిని విద్వాంసలోకం గుర్తిస్తుందనే విశ్వాసం.

కంకాళరాత్రిని గూర్చి.

(కం) కాళరాత్రి అన్న శీర్షికకు నాలుగర్థాలున్నాయి.

1. కాళరాత్రి — చీకట్లు నిండిన రాత్రి
2. కాళరాత్రి - పాములతో కూడుకున్న రాత్రి
3. (కం) కాళరాత్రి - (కం- నీరు) జలమయమైన చీకటి రాత్రి.
4. కంకాళరాత్రి - పీనుగులతో కూడిన రాత్రి.

ఇందులో భయానక బీభత్సకరుణ రసాలు పోషితాలు. ఝంఝా మరుదుద్ధతిని శబ్దం ద్వారా చిత్రించడానికి నేనుచేసిన ప్రయత్నం రెండవపేజీలోని ఒకటి రెండు పద్యాల్లో చూడవచ్చు. వర్ణిత వస్తువుయొక్క స్వరూపం కళ్ళకు కట్టినట్లు, ఒక దృశ్యం లాగా, కనిపింప జేయాలన్న తపననాది. దానికోసం చాలా శ్రమిస్తాను. అది ఈ గ్రంథంలో ఎక్కువగా కనిపిస్తున్నదని నా నమ్మకం. పాఠకులే నిర్ణేతలు మరి!

కులవ్యవస్థ మన భారతీయులకు జాతీయతను లేకుండా చేసింది. ఏకతా భావం వుంటేనే జాతీయతా భావం వుంటుంది. మనలో ఏకత్వములేదు. జాతీయత లేదు. వ్యక్తిస్వార్థం తప్ప జాతి స్వార్థం లేదు. జాతికోసం బాధ్యత లేదు.

జాతిజాగృతి పొందేకొద్దీ జాతీయభావం నశించి కుల స్వార్థాలూ, ద్వేషాలూ పెరుగుతున్నాయేగాని, సమసిపోవడంలేదు. మూడువేల ఏండ్లుగా మన జాతికి పట్టుకొన్న చీడ అంటరానితనం. కులవ్యవస్థ వున్నంతకాలం ఈ అంటరానితనం పోదు. కుల వ్యవస్థనిర్మూలనకు నడుం బిగిస్తే తప్ప, సమాజం నిస్స్వార్థంగా, సగౌరవంగా బ్రతుకదు. చావుతో గాని కులతత్త్వం పోదన్న భావం 6వ పేజీలోని రెండో పద్యంలో వ్యంగ్యంగా చిత్రించడాన్ని గమనించగలరు. 'పంచజన దుర్మార్గం'లో (పంచజన-మనుష్యులు) కూడా ఈ భేదాలను సతార్కికంగా నిరసించడం జరిగింది. 'అ (హ) రిజనులు' శీర్షికగురించి వేరే చెప్పనక్కర్లేదు. అరిజనులు హరిజనులు అని రెండక్షరాలను ఈ శీర్షికస్ఫురింపచేయాలి,

హరిజనులకు సవర్ణులు అరిజనులు (శత్రువులు). సవర్ణులకు హరిజనులు అరిజనులు. ఎంతకాలమైతే సవర్ణులు సవర్ణులుగానూ, హరిజనులు అవర్ణులుగానూ కొనసాగుతారో అంతకాలమూ ఈ అరిత్వం తప్పదు. తర్కయుక్తంగా హరిజనుల కోపాన్నీ ద్వేషాన్నీ, ప్రతీకారేచ్ఛనూ, చిత్రించడానికి, ప్రయత్నించాను.

పద్యశిల్పం గురించి ఒకమాట మనవిచేస్తాను. నాకు నన్నయ్య, భట్టు మూర్తులంటే చాలా యిష్టం. వాళ్ళపద్యాల్లో అక్షరరమ్యత అద్భుతంగా దర్శనమిస్తుంది. వస్తుస్వభావాన్ని అక్షరాల్లో ప్రతిబింబింపజేసే కవులువీరు. వాళ్ళే నాకు ఆదర్శకవి పుంగవులు. వీరరసమంటే నాకు ప్రత్యేకమైన అభిమానం. తరువాత కరుణ-శాంతరసాలు. వీరరసానికి సోదరరసాలే రౌద్ర భయానకాలు. అందుచేతే శార్దూల మత్తేభాలను నడిపించడమంటే నాకెంతో ఇష్టం సీసపద్యాలు కమ్మచ్చులో పెట్టి సాగదీసినట్లు వస్తేనే నాకుతృప్తి. సార్థక పదప్రయోగంతో సాఫీగా నడిస్తేనే సీసం యొక్క అందం. భట్టుమూర్తి సీసాలు బ్రహ్మాండమైన గమనంతో వుంటాయి. భట్టుమూర్తినే నేను ఆదర్శంగా ఎంచు కొంటాను, సీసం ప్రసక్తివస్తే.

ఈ చిన్న గ్రంథంలో అచ్చుతప్పులు కొన్నిదొర్లాయి. తెలుగులో ముద్రారాక్షసం అనివార్యమనుకోండి. అయితే అర్థా వగతికి భంగం కలిగించే విధంగానూ, (36 వ పేజీ 'రెట్ల' అని ఉండటానికి బదులు 'రేట్ల' అని ముద్రితం), గణరూపానికి భంగ కరంగానూ (34 వ పేజిలో 'రక్షగా' అని ఉండటానికి బదులు

'రక్షణగా' అనివుంది) చక్కెరకు బదులు చెక్కెర అని పడింది. అల్పసంఖ్యలోనైనా తప్పిదాలు దొర్లడం శోచనీయవిషయమే. సహృదయులు ఉపేక్షిస్తారని నమ్ముతున్నాను. ఐతే ఒకటి రెండు చోట్ల యతిదోషాలుగూడా దొర్లడంజరిగింది. భావతీవ్రతలో పద శిల్పానికి అనుగుణంగా స్ఫురించిన శబ్దాన్ని అలాగేవాడవలెనన్న భావంతో, ఆ తర్వాత సర్దడమూ, సరిదిద్దటమూ సరైన పద్ధతి కాదన్న అభిప్రాయంతో వాటిని అలాగే వదిలాను. ప్రాసయతి విషయంలో పూర్వులనియమం తెలిసిగూడా కావాలని కొంత స్వతంత్రించాను. అలాగే పూర్వలాక్షణికులు ఒప్పిఒప్పని అఖండ యతిని ధారాళంగా ప్రయోగించడం కూడా జరిగింది. వీటిని సహృదయులు గమనిస్తారని ఆశిస్తున్నాను.

నా పుస్తకాలకు అభిప్రాయాలను వ్రాయించడమంటే నాకు సహజంగా ఇష్టం లేదు. అయితే శ్రీకప్పగంతులవంటి పండిత కవులతో సామీప్యం పెరిగాక, పద్యకావ్యసంప్రదాయానికి సరి పోతుందన్న భావంతో ఈ పుస్తకానికి అభిప్రాయాలను వ్రాసివ్వ వలసిందిగా ఉభయభాషల్లోనూ సారమతి అయిన ఉద్దండ పండిత కవిశ్రీకప్పగంతులలక్ష్మణశాస్త్రిగారినీ, ఆప్తులు కావడమేకాకుండా సంప్రదాయ విద్యాపారంగతులూ, ఉత్తమవిమర్శకులూ అయిన శ్రీ తిరుమల రామచంద్రగారినీ, కులవ్యవస్థ నిర్మూలనకు అంకిత హృదయులూ, తీవ్రభావుకులూ, ఉత్తమకవులూ అయిన డాక్టర్ బోయి భీమన్నగారినీ, అభ్యుదయ దృక్పథంతో అతి సుందర కావ్యాలను వెలువరించి ఇట్లు ఉత్తమకవితారంగంలోను, అటు సినీ

కవితారంగంలోనూ సవ్యసాచులూ నాకు ఆప్తులూ అయిన డా॥ దాశరథి డా॥ నారాయణరెడ్డిగార్లనూ అభ్యర్థించాను. వారు సాదరంగా సద్విమర్శలనిచ్చారు. వారందరికీ నా ధన్యవాదాలు.

ఉప్పెనను పురస్కరించుకొని వెల్లువికిన పద్యాలను కావ్యరూపంలో ప్రకటించమంటూ పదే పదే నన్ను ప్రోత్సహిస్తూవచ్చిన హితైషులూ కవిమిత్రులూ అందరికీ ఈ సందర్భంగా నాకృతజ్ఞతలు అర్పిస్తున్నాను. అలానే ఇతరం ఎన్నిపనులున్నా, నా పనిని తన పనిగా భావించి శ్రద్ధగా పుస్తకాన్ని అచ్చొత్తించి యిచ్చిన వెంకట్రామా పేపర్ ప్రోడక్ట్స్ అధినేత శ్రీ మురళీకృష్ణ గారికి నా కృతజ్ఞతలు. ఈ సందర్భంగా పెద్దలు శ్రీ దేవులపల్లి రామానుజరావుగారి అవ్యాజప్రేమనూ నాకు 'నెనరుపూల'నందించే ఆప్తులూ, సద్విమర్శకులూ శ్రీ మరుపూరు కోదండ రామరెడ్డిగారి ప్రేమపూర్వకమైన ప్రోత్సాహాన్నీ, నాకు అతిప్రేమపాత్రులూ, సద్విమర్శకులూ శ్రీ త్రిపురనేని సుబ్బారావుగారు కలిగించే ఉత్సాహాన్నీ స్మరించకుండా వుండలేను శుద్ధ ప్రతిని తయారు చేయడంలోనూ ప్రూఫులు దిద్దడంలోనూ నిత్య సహాయం చేసే ఊహ తెలియంగల లేఖక పాఠకోత్తములు గంగిశెట్టి లక్ష్మీ నారాయణ, వడ్డపల్లి సత్యం, బుడ్డిగ సుబ్బరాయన్ గార్లకు నా అభివందనాలు. ఇతరవిధాలా సహాయపడిన అందరికీ నా అభివందనాలు

# జ్వాలాజిహ్వాలు

డా॥ దాశరథి

వెన్నెలరాత్రిని గూర్చి వ్రాసేవారు వేలకువేలు కనబడతారు. కాళరాత్రిని గూర్చి, కంకాళరాత్రినిగూర్చి వ్రాసేవారు కరువైపోయారు.

"అదియొక దుర్దినమ్మ..." అంటూ ఎత్తుకున్నారు అంతటి నరసింహంగారు. అంతా మంగళప్రదంగా ఉండాలకునేవారు ఎక్కువ. ఈ జగత్సృష్టిలో మంగళం తక్కువ అమంగళం ఎక్కువ.

మారణహోమాలు జరిగే ఈ ప్రపంచంలో మనిషికి మనిషి శత్రువు. కాని ప్రకృతికూడా మనిషిమీద పగ బూనితే దిక్కేది? ఆంధ్ర దేశం భయంకరమైన బీభత్సానికి గురి అయింది ఉప్పెన దెబ్బకు.

"ఎంతచింతించినన్ గూడ సుంతయైన..." అన్న పద్యంలో, ప్రాణికోటి నిర్వేదముతో పాటు కవి నిర్వేదం ఉంది.

"అవగాఢాఖిల పార్శ్వభూమిమయమై..." అన్న మత్తేభం ఎత్తుగడ అంతటివారి సత్తువను చెబుతుంది.

దుఃఖమయమైన ఈ ప్రపంచలో ప్రజల వేదననుగాక కవి ఏం వ్రాస్తాడు ?

కరుణ రసం తొణికిసలాడుతుంటుంది అంతటివారికవితలో.

నేటి కుల, మత సంకుచితత్వం చూచి వేదనపడుతున్నారు అంతటి వారు. "వేదాలలో లేని వేర్పాటు ధోరణి" ఈనాడు దేనికి? అని ప్రశ్నిస్తున్నారు.

"స్వార్థం పరమార్థమై అనృతం సకలార్థసాధకమైంది" అని ఖేదపడ్డారు కవిగారు.

అభ్యుదయ భావములు గల అంతటివారు తమ కవిత ద్వారా ఎంతటివారినైనా భేష్ అనిపించగలరు.

కవిగానే గాక నిశిత పరిశీలకుడుగా అంతటివారికి మంచి పేరుంది.

అంటరాని తనాన్ని నిర్మూలించాలనీ అహింసను అవలంబించాలనీ కవి బోధిస్తున్నారు.

అంతటివారి పద్యరచన హృద్యమైనది. అయితే వారు గేయాలూ వ్రాశారు-ఆ ప్రక్రియలోనూ సమర్థులనిపించుకొన్నారు.

"జాతి చీలి చీలి చీలి
వ్యక్తి వ్యక్తి వేర్వేరై
అనైక్యముగ పరిణమించె
అభవా! పరిరక్షింపుము"

అన్నారు అంతటివారు. అభవుడు పరిరక్షింప గలడా? అని సందేహం కలిగేటంతగా చీలినజాతిని ఏకతా సూత్రాన బంధించ గలవారు ప్రగతి శీలురైన కవులే!

నరులు అసురులుగా ప్రవర్తించినప్పుడు నరసింహావతారం ధరించి విజృంభించే నరసింహంగారి లేఖిని విప్లవ జ్వాలాజిహ్వాలు కలది.

# సంధ్యారాగం

డా॥ బోయి భీమన్న

పనసతొనల్ మరందమును పాలును, చక్కెర, నేయి మీగడల్
పనుపడ మేళవించి కడుపారగ జుర్రగ నాత్మ కెంత యిం
పును గలిగించు, దానికి నపూర్వము, వందల కోట్ల రెట్ల తీ
పును గల దమ్మయన్, బలుకు పువ్వుల గుత్తుల మెత్తనైన దై

అమ్మ అనే పదాన్నీ, ఆమె రూపాన్నీ యింత రుచిర మధురంగా అనుభూతికి తేగలిగిన కవులు పూర్వం యేమో కానీ ఈనాడు మాత్రం లేరంటే అబద్ధం కాదు. ఇది ఈకావ్య రచయిత డాక్టర్ అంతటి నరసింహంగారి కవితాశక్తి,

సృష్టిలో మనకు తెలిసిన మధుర పదార్థాలన్నిటినీ ఒక చోట రాసిపోసి దానిని వందలకోట్ల రెట్లు ఊహించుకొంటే అది అమ్మ అవుతుంది అన్నారు అంతటివారు.

అనుభూతి ఉన్నప్పుడే రసానుభూతి కలుగుతుంది.

కవిత చెప్పడానికి పద్యాలను వాడుతున్న ఆధునిక కవులలో అంతటి వారొకరు. ఉత్పల సత్యనారాయణాచార్య, సుబ్బన్న శతావధాని, ఆశావాది ప్రకాశరావు, జ్ఞానానందకవి, సెనగన నరసింహస్వామి కొంతవరకు నేను, మరి యిద్దరు ముగ్గురు తప్ప

నా ఎఱుకలో పద్యాలు వ్రాస్తున్న కవులు చాల తక్కువ, పద్య కళను ఇంకా పట్టుకొని వ్రేలాడుతున్న వాళ్లు వీళ్లు.

ఇక్కడొక చిత్రం గమనించవలసి ఉంది.

మన పూర్వాచారాలను గానీ, కళలనుగానీ, సంప్రదాయాలను గానీ, ఆధునిక నాగరికతా ధాటినుంచి కాపాడి భద్రపరిచే వాళ్లు ముఖ్యంగా మూర్ఖులూ, అజ్ఞానులూ. వెనుకబడ్డవాళ్ళు అని పించుకొనే ప్రజలే. సనాతన ధర్మాలను, పూర్వాచారాలను- అవి మూఢాలైనా, అమూఢాలైనా- వాటిని పాశ్చాత్య నాగరికతా ప్రభావంనుంచి కాపాడి ఉంచినవాళ్ళు స్త్రీలేకదా! అలానే గ్రామీణ కళలనూ, క్రీడలనూ. సాంఘిక వ్యవస్థనూ పరిరక్షిస్తున్న వాళ్లు హరిజనులూ వెనుకబడిన కులాలవాళ్ళూనూ, ఇదే స్థితి లలిత కళలకూ, సాహిత్యానికీ, కూడ ఉంది.

ఇప్పుడు ముఖ్యంగా పద్యకళను తీసుకుంటే దానిని చావకుండా బ్రతికిస్తున్న వాళ్లు మొత్తంమీద ఈ వెనుకబడిన కులాల కవులే అని అనవచ్చు. అది స్పష్టంగా కనిపిస్తూ ఉంది.

పద్యకళ చాలా గొప్పకళ, శాస్త్రీయమైన కళ. అది అజరామరం. శైథిల్యము లేనిది. క్లాసికల్ ఆర్ట్. వృక్షజాతి పుట్టి నప్పుడు మామిడిచెట్టు ఎలావుండి ఎలాపండేదో, యిప్పుడూ అలానే వుండి అలానే పండుతూ వుంది. అలానే పద్యం కూడా. లయబద్ధమైన, రసవంతమైన పద్యానికి స్థిరత్వం ఉంది, ఒక అమృత శిల్పంలా ఎల్లరకూ ఎల్లకాలాలలోనూ ఆనందం కలిగిస్తూఉంటుంది.

అట్టి పద్యకళను తమ సాహితీ నిర్మాణానికి స్వీకరించా రంటే- అదొక్కటే చాలు అంతటి వారెంతటివారో చెప్పడానికి.

ఈనాడు కవితాక్షేత్రాన్ని చూస్తూవుంటే, అందులో వాణిజ్యపు పంటలే తప్ప ఆహారపు పంటలే కనిపించడంలేదు. వుంటే అక్కడక్కడా గంజాయి, దూలగొండి, పల్లేరు మొక్కల్లాంటివి తగులుతూ ఉంటున్నాయి. కవిసమ్మేళనలను గమనిస్తే వాట్లలో ఎక్కువగా దూలగొండే కనిపిస్తుంది. దానిని ఎక్కడికక్కడ దులుపుకుపోవడమే తప్ప సదస్యులు ఆలోచనామృతంతో, ఆనందంగా యింటికిపోవడం సకృత్తు.

ఇటువంటి క్షణికోద్రేకపు దూలగొండి కవితా కల్లోల కాలంలో నిగ్రహంతో నిలిచి స్థితప్రజ్ఞతో, స్థిరమైన కవితాసృష్టి చేస్తున్న అంతటివారు నిజంగా ధన్యులు.

"ఎవడురా వాడు మమ్మింత చివరిదాక
తరిమి తరిమి హృదంత రాంతరములందు
దహనకీలల దరికొల్పి తనను తాను
దగ్ధమొనరించు కొనుచున్న దానవుండు".



ఈ పద్యాన్ని పరిశీలించండి- ఇది అస్పృశ్యులుగా గ్రామాల వెలుపలకు నెట్టివేయబడ్డ హరిజనులను గురించి వ్రాసిన పద్యం, ఎంత చక్కని పద్యం, ఎంతటి వ్యంగ్య గర్భితం, ఎంత హెచ్చరిక!

హరిజను లెవరు? వాళ్లు ఎందుకు వెలివేయబడ్డారు అనే విషయాలలోకి వెళ్లాలంటే- వరాహ పురాణంలోని ధర్మవ్యాధుడి, మతంగుడి చరిత్రల వరకూ వెళ్లవలసి వుంటుంది. ఈ చరిత్ర లన్నీ నా రచనల్లో దొరుకుతాయి తెలుసుకోవాలనే జిజ్ఞాస ఉన్న వాళ్ళకి. అది అలా ఉంచుదాం.

"చండాలస్తు జనితో బ్రాహ్మణ్యాం వృషలేనయః"

బ్రాహ్మణ స్త్రీకి శూద్ర పురుషుడికి పుట్టినవాడు చండాలుడు అని దీని యర్థము. ఇది అమరకోశం అనే నిఘంటువు చెప్పిన అర్థం. ఈ చండాలుడే వరాహ పురాణంలోని మతంగుడు వెలి వేయబడి యింటినుండి నెట్టివేయబడిన తొలి హరిజనుడు.

తల్లిదండ్రులు వేరువేరు వర్ణాలకు చెందినప్పుడు న్యాయంగా తండ్రి కులానికో, కనీసం తల్లి కులానికో చెంద వలసిన బిడ్డడు- ఆ రెండు కులాలకూ చెందకుండా మరో కులంగా అంటరాని వాడెలా అయ్యాడు.

ఇదే అంతటివారు అడుగుతున్న ప్రశ్న. ఎవడురా వాడు అంటూ ఇంత చివరిదాకా తరిమి తరిమి కొట్టిన వాడెవ్వడు? సాహిత్యం ఆలోచనామృతం కదా, ఆలోచించండి మరి.

ఆ తరిమి కొట్టినవాడు ఈ హరిజనుల హృదంతరాలలో దహనకీలలు దరికొల్పడమే కాక తనను తానే దగ్ధం చేసుకొంటు న్నాడట. అదెలా?

తాను రగుల్కొల్పిన మంటల్లో తానే దగ్ధమైపోతున్నాడని తాను తవ్వుకున్న గోతిలో తానే కూలిపోతున్నాడని. అల్పాక్షరాలలో అనల్ప భావం నిక్షిప్తంచేసే అసలు సిసలు కవితకు ఈ పద్యం ఒక ఉదాహరణ. ఈ భావం పరమసత్యం. మనకు ఈనాడు స్పష్టంగా కనిపిస్తున్న సత్యం. కాకపోతే-

"కృణ్వంతో విశ్వ మార్యం" ప్రపంచాన్నంతటినీ ఆర్యమయంగా మార్చండి అని మన ఋగ్వేదం ఉద్బోధిస్తూ ఉండగా మన ప్రక్కవాణ్ణి. మన జాతివాణ్ణి రకరకాల పరాయి మతాలలోకి తరిమి వెయ్యడం ఏమనిపించుకొంటుంది ఆత్మ వంచనా, స్వమత ద్రోహమూ కాదా ?

ఇలాంటి పద్యాలను ఎన్నిటినైనా ఉదాహరించవచ్చు ఈచిన్ని కావ్యం నుంచి. కాళరాత్రి, పంచజన దుర్మార్గము, హరిజనులు, నాయకుడు, వల్లభాయిపటేల్. మధురకవి, మృత్యుంజయులు, అమ్మ, ముక్కోణవు సందేశము (గేయ నాటిక)- ఇవి ఈ సంపుటిలోని చిరుకావ్యాలు- అన్నీ "వాక్యం రసాత్మకం కావ్యం" అన్న నిర్వచనానికి ప్రతిరూపాలే.

ఇందులో "మృత్యుంజయులు" అనేది అమధ్య ముఖ్యమంత్రి చెన్నారెడ్డిగారు వగైరా ఎక్కిన విమానానికి ప్రమాదం జరగడం, దానినుంచి వారంతా క్షేమంగా తప్పుకోటం గురించి వ్రాయబడినట్టిది. ముక్కోణపు సందేశం కుటుంబ నియంత్రణకు సంబంధించి అద్భుత భావనాశక్తితో రూపొందించబడిన గేయ

నాటిక. దీనిని స్టేజికి అనుకూలంగా మలిచి రసవంతంగా ప్రద ర్శించవచ్చు.

అంతటివారు గొప్పకవి, రచయిత, నవలిస్టు మాత్రమేకాక ప్రతిభావంతుడయిన సంస్కృతివేత్త, దీక్షాబద్ధుడైన సంఘ సంస్కర్త కూడ. ఆయన సమగ్ర సంస్కృతీవేత్త అనడానికి ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాంస్కృతిక వ్యవహారాల ప్రత్యేకాధికారిగా ఆయన ప్రదర్శిస్తున్న శక్తిసామర్థ్యాలూ, నిర్వహిస్తున్న కార్యక్రమాలూ, నిదర్శనాలు.

నిజాయితీగల సంఘసంస్కర్తఅనడానికిఆయన చేసుకున్న చేసిన కులాంతర వివాహాలే సాక్ష్యం. కులాంతర వివాహాలు చేసు కొన్నవాళ్లు ఈనాడు చాలామంది ఉన్నారు. అయితే అందులో అత్యధిక సంఖ్యాకులు తమతమ కులాలను మరచిపోయి తమ చుట్టు కృత్రిమ ప్రతిష్ఠల గోడలను నిర్మించుకొని అటువారికి గాని, ఇటువారికి గాని, ఎందుకూ పనికిరాకుండా పోతున్నారు. కులాంతర వివాహాల ఉద్దేశాన్ని మట్టుపెడుతున్నారు.

అంతటివారు అలాకాక దృఢ విశ్వాసంతో ఈ సంస్కర ణను తమ జీవితంలో అన్ని విధాలా అమలు పరుస్తున్నట్టి వారు. తాను వెనుకబడిన కులంవాడై ఉండి మరో కులం అమ్మాయిని పెండ్లాడి సంస్కరణకే ఆదర్శప్రాయు లైనారు, యేనాడో అలాంటి వివాహాలు జరిపించారు. హరిజనులంటే ఎంతో వాత్సల్యం; పేదకులాల వారిలో సాంస్కృతిక చైతన్యం వెదజల్లి తేజ పరచాలని ఆకాంక్ష. తన కుటుంబంలో హరిజన బాల

బాలికలను కలుపుకుని పెంచి పెద్దచేసి, స్థిరజీవితాలను ఏర్పాటు చేసిన చేస్తున్న ప్రగతిశీలి డాక్టర్ అంతటి. సాంఘిక సాంస్కృతిక కార్యక్రమాలూ. సభలూ, సమారోహాలూ, ఎక్కడ జరుగుతున్నా వెళ్ళి పాల్గొని విజయవంతం చేసిన ఉదంతాలు లెక్కకు మిక్కిలి.

ఇంతటి సర్వతోముఖ ప్రజ్ఞాశాలినీ, వ్యుత్పన్నునీ, కవితా సృష్టికి నా పరిచయం దేనికి? చదవండి. ఈచిన్ని కావ్య సంపుటినే కాదు ఈయన రచన లన్నిటినీ చదవండి, ఉత్తేజితులుకండి. ఇదే తెలుగు సాహితీ సహృదయులకు నా విన్నపం.

# ఈ పుస్తకం చదివి

డా॥ సి. నారాయణరెడ్డి

అనుకున్నాను దీనికి అభిప్రాయాలూ, పీఠికా అక్కర్లేదని. అంతటి నరసింహంగారి అభిప్రాయాలూ ఆశయాలూ ఈ పుస్తక మంతటాపరుచుకుని వున్నాయి, పద్యగేయ రూపంలో.

లోగడ వెలువరించిన గేయ సంపుటి నరసింహంగారి హేతువాద దృక్పథానికి సేతువులా నిలిచింది. ఆయన వ్యక్తికీ, సమాజానికీ సంబంధించిన అభిప్రాయాలు కొన్నింటిని ఎంత నిర్దిష్టంగా, విశ్లేషణ పుష్టంగా వెలువరించారో ఆ సంపుటే చెబుతుంది.

ఈ సంపుటిలో చివరవున్న 'ముక్కోణవు' పాటతప్ప మిగతావన్నీ పద్యాలే. వాటిల్లో చాలావరకు అప్పుడప్పుడు జరిగిన సంఘటనలతో పోటెత్తినవున్నాయి.

తుఫాను దురంతాన్ని తలచుకున్నా, తోటి సోదరుడైన హరిజనునికి జరుగుతూవున్న అన్యాయాన్ని చూస్తూవున్నా నరసింహంగారిలో పద్యాలు పరుగుతీశాయి; అటు జాలిని వర్షిస్తూ-ఇటు జ్వాలల్ని పుక్కిలిస్తూ.

ఏమాత్రం వీలున్నా నరసింహంగారి కలం వర్ణమతకుల విద్వేషాల మీద విరుచుకుపడుతుంది. ఉత్తమ నాయకత్వం ఎలా వుండాలో నిర్వచిస్తుంది. మంచిని పెంచమన్న గురజాడ సూక్తిని గుర్తుచేస్తుంది.

# కొండ యద్దమందు కొంచెమై యుండదా ?

మిత్రులు డాక్టరు అంతటి నరసింహంగారు సహృదయుడు. సహృదయుని హృదయం ఏ మంచికైనా స్పందిస్తుంది, ఏ చెడుకైనా వైరస్యం చిందిస్తుంది. సంఘంలో శతాబ్దాలుగా కరుడు కట్టుకొని పోయిన కల్మషం ఏ సహృదయునినైనా కలవర పెడుతుంది. మరి నరసింహంగారి వంటి సహృదయుని హృదయం, సంఘసంస్కరణమే ఊపిరి అయిన హృదయం ప్రజ్వలింపక పోవడం అసంభవం కాదుకదా ! కనుకనే ఆయన కావ్య హరిజనులు.

"తర తరాలుగ దాస్యమ్ము దారి తెన్ను
కానగారాని అంధకారాన మమ్ము
ముంచి పై పెత్తనము చలాయించినారు
చెల్లె రోజులు ఇక దారి వల్ల కాదె॥

అని తెగవేసి చెప్పారు. నిజం. అర్ధశతాబ్ది క్రితంవున్న పరిస్థితి నేడుందా ? మానవత్వం మందహాసం చేస్తూ మాలలను పలకరించిన కాలం గాంధీయుగంలోనూ, ఇలాటిదే అయిన తాథాగతుని యుగంలోను తప్ప మరెప్పుడైనా ఉందా ? తథా

గతుడు సారిపుత్త మొగలానలను చేరదీసి తనంతటి వారినీ చేశాడే! తథాగతుని తథామార్గంలో నడిచిన హర్షవర్ధనుడు, మాతంగ దివాకరుని తన ఆస్థానంలో మయూరులవంటి వారి సరసన అసీనునిచేసి గౌరవించాడె! శంకరుడు "చండాలోస్తు సతుద్విజోస్తు గురురిత్యేషా మనీషా మమ" అని మానవుని మధ్య తరతమాలు చూడవద్దని ఘంటా ఘోషంగా చెప్పాడే! రామానుజుడు తిరుప్పాణుని ఆళ్వారులలో చేర్చి ఆదరించాడె! నిన్న మొన్న రాయల కాలంలో కనకదాసుని వ్యాసతీర్థులు పరమ పూజ్యునిగా పరిగణించాడే! మరి సంఘ మెందుకు ఆమహనీయుల దారిని నడువలేదు? నడువదు? ఇది సంఘ దౌర్బల్యమో! దుష్టత్వమో! నరసింహాంగారి హరిజనుడు దీనిని

"తలచు కొన్నప్పుడెల్ల డెందమ్ము కోప
తప్తమై ప్రతీకారపుదాకు కోప
ఘూర్ణ మాన స్వరూపమై ఘోర విశస
నత్వ తత్త్వమ్మన పురోహితత్త్వ మొందు":

అని కన్నెఱ్ఱజేయడంలో తప్పేమీ లేదు. విచిత్రమేమిటంటే వారే అన్నట్టు

"మేము త్రవ్విన బావులు మామకీన
ఘర్మ ఫలితాలు మాత్రమే కావు సర్వ
విధ సముచ్ఛిష్ట ఫలితాలు వీని నీరు
త్రాగుచునె మమ్ము మాత్రము తాకనీరు!

సంస్కర్త అయిన నరసింహాంగారి మనస్సు హిరణ్యకశిపుని చూచిన నరసింహునివలె ఘూర్ణిల్లినది, కాని ఆయనది గాంధీమార్గం. ఆయన త్రికరణాలలోను గాంధీ మతానుయాయి కనుక "హింస నహింసచే గెలుచు టెంతయు మానవతాయుతమ్ము" అని నిశ్చయించుకొంటాడు. సహజీవనం తప్పదని భావించి, ప్రశాంతంగా హక్కులకోసం పోరాడడానికి నిశ్చయించుకొంటారు ఆయన. హరిజనులు—మంచి చెడులు, దివారాత్రం సహజీవనం చేస్తున్నప్పుడు వీరెందుకు చేయరాదు?

కులవ్యవస్థకు మూలం వృత్తి. ఆయావృత్తులవారు అభివృద్ధిచెందినకొలదీ తామే గొప్ప అనే భావం బలపడి ఉచ్చనీచాలు పుట్టాయి. సంఘంలో ప్రతి వృత్తి పవిత్రమైనదే. పంచజ్ఞానేంద్రియాలు, పంచకర్మేంద్రియాలు సక్రమంగా వుంటేనే దేహం చక్కగా పనిచేస్తుంది. ఈ అంగాలలో అన్నీ సమానమే, అలాగే సంఘంలోని ప్రతి వర్గమూ సమానమే, ఆవశ్యకమే. వృత్తులు మూలమయిన వర్ణవ్యవస్థ ప్రాచీనజాతులు పెక్కింటిలోవుండేది; కాలక్రమాన నశించింది; మనదేశంలో మాత్రం దురదృష్ట వశాన వజ్రబంధంతో వున్నట్టు, ఊడలతో విస్తరించి స్థిరపడిన వటవృక్షం లాగ స్థిరపడింది. కాలానుగుణం కానందున ఎన్నో చిక్కులకు లోనవుతున్నది. ఈ అసంబద్ధమైన వర్ణవ్యవస్థను ఏ మాత్రం హేతువాది అయినా ఈసడిస్తాడు. సంస్కరణవాది అయిన నరసింహాంగారి మనస్సు ఈ విషయంలో కుతకుతలాడడం సహజం కనుకనే, ఆయన

"ఎంత చిత్రమ్మో మాతృగర్భాంతరమున
నెలలు తొమ్మిది మాత్రమే నివసముండి
నేలపై కన్ను దెరిచి యీ నీరుగాలి
నింగితేజస్సు మట్టినే మింగిబ్రదుకు
నరుడు భేదమ్ము పాటింప నగవుగాదె!"

అని విస్తుపోతాడు. అనాహూతాలు ఏర్పడినప్పుడు ఈ భేదాలన్నీపోయి మానవజాతి అంతా ఒక్కటేనని నిరూపిత మవుతుందని వ్యంగ్యంగా ఒక్క చురక అంటించాడు రచయిత '(కం) కాళరాత్రి' ఖండికలో. ఇటీవల తెలుగు సీమను తాకిన తుఫానును హృదయ విదారకంగా వర్ణిస్తూ,

"బ్రతికినన్నాళ్ళు నేగొప్ప వాడు తక్కు
వంచు స్వార్థాన మూర్ఖంపు బ్రతుకు బ్రతికి
వర్ణకుల భేదముల నెంచవలదటంచు
బుద్ధిగా మాల మాదిగ బోయకాపు
కమ్మ బ్రాహ్మణ రెడ్డి కైకాల బలిజ
శవము లొక దానిపై నొకటి చక్కనొరిగె".

నట.

పాపం యీనాటి నాయకమ్మన్యులను ఒక వైపుచూస్తూ నరసింహంగారు 'నాయకుడు' అన్న ఖండికలో ప్రజానాయకుల లక్షణాలను ఏకరువుపెట్టి పప్పులో కాలు వేశారనిపించింది నా మట్టుకు నాకు.

"సామ్యవాదము ప్రజాస్వామ్యమ్ము క్షేమమ్ము
చేయరాదుగ 'వట్టి చేతిమూర'
సంక్షేమ రాజ్యమ్ము సమదృష్టి న్యాయమ్ము
కారాదుగా 'నేతిబీరకాయ'
దున్నువానిది భూమి యున్నవానిది యిల్లు
కారాదుగా 'బూటకంపు మాట'
పైన పటారమ్ము లోన లొటారమ్ము
గానుండ రాదుగా 'కర్మభూమి'

అనుచు భావించి పూర్ణమౌ యాత్మశుద్ధి
భావశుద్ధి క్రియాశుద్ధి వైవుబుద్ధి
జొనిపి సార్థక జీవితము వరించు
నట్టివాడెవో సార్థక నాయకుండు"

ఇలాటి నాయకుడు ఇప్పుడున్నాడా? ప్రస్తుతం మన నాయకు లెలాటి వారో మనకూ తెలుసు. ఆ నాయకుల అంతరంగాలకూ తెలుసు. నరసింహంగారివి కేవలం పగటి కలలు! మరి రెండు తుఫానులు తెలుగు దేశాన్ని యెడాపెడా కొట్టి ఇప్పటి జనాళి నశించి, నూతన సృష్టి ఏర్పడినప్పుడు నరసింహం గారి పగటి కలల నాయకులు పుడతారేమోగాని, మన జీవిత మున్నంతవరకు ఈ పగటి వేషాల నాయకులను పరికిస్తూ వుండ వలసిందే.

'అమ్మ'ను సుకుమార పేశలంగా నిర్వచించారు అంతటి నరసింహంగారు:

"పనస తొనల్ మరందమును పాలును చక్కెర నేయిమీగడల్
పనుపడ మేళవించి కడుపారగ జుర్రగ నాత్మ కెంత యిం
పును గలిగించు దానికినపూర్వము వందలకోట్ల రెట్ల తీ
పును గల దమ్మయన్ బలుకు పువ్వులగుత్తుల మెత్తనైన దై"

అమ్మలోని ప్రేమ మాధుర్యాన్ని ఎన్ని మాటలతోనైనా కొలువలేము.

అంతటి నరసింహంగారి మేధకూ కవితా హృదయానికీ సహృదయుతకూ చిన్న చిన్న ఉదాహృతులు అవి, ఆయన సంస్కార ప్రియతకు, కార్య ప్రవణతకు మచ్చుతునకలివి. కొండ యద్దమందు కొంచెమై యుండదా ?

సిద్ధార్థి ఫాల్గుణ పూర్ణిమ
హైదరాబాదు

భాషా సేవకుడు
తిరుమల రామచంద్ర

## విద్వత్కవితాపాంథుడు డా॥ అంతటి నరసింహం

మిత్రుడు డా॥ అంతటి నరసింహంగారు రచియించిన కావ్యఖండికలు వివిధరీతులలో సాగి చవులూరింప జేయుచున్నవి. నేను అచ్చటచ్చట, ముద్రణాత్పూర్వమే, చక్షురక్షర సంయోగ పూర్వకముగా చూచితిని నరసింహంగారి ఛందః కవితాశైలి శుభోదర్కమును సూచించుచు, విద్వదామోద కరముగా నున్నది. కవితలో చేసిన అపూర్వ - సార్థక పదప్రయోగము ఆయన వ్యుత్పత్తిని చాటుచున్నది.

నరసింహంగారు తొలిఖండిక శీర్షిక, కవితావిషయమునకు దర్పణ సదృశమై, కాళరాత్రి కంకాళరాత్రిగా మారిన సత్యము స్ఫుటీకరించుచున్నది. ఆ రాత్రి సంఘటనములు విన్నవారికే యెద తరిగినట్లుండగా, చూచినవారికెట్లుండునో గదా! కంకాళ రాత్రి శ్రవ్యకావ్యఖండికయైనను, దానిని జదువ దృశ్యకావ్యము వలె, ఆ సంఘటనలు కన్నులకు గట్టినట్లుండి, చదువువారిని కరుణ రస తన్మయులను చేయుననుటలో సందేహము లేదు. ఇది నా యనుభవ పూర్వకముగా పలుకుమాట. నిక్కముగా నీ రాత్రి తోయము 'అభీల, విలోల ఘూర్ణితధరాకారమై యైనది. 'నీరాకార ధన్వాకృతియయి, అభూతము అద్భుతమునైన ఉపమ కవి హృద

యమునకు తోచినది. 'ధన్వ' మనగా నిర్జల మరుభూమి. అది నీరాకరమైనదని యీకవి చెప్పెను'. అనగా. నిర్జలప్రదేశము సస్యమగుట తథ్యము, కాని, జలమయమైన యీ ఉప్పెన, సస్యములనే కాక, ఎదుగుచున్న ప్రాణులను గూడ నశింపజేసెనను తథ్యము ఇందు నిరూపితమగుచున్నది. ఇది యిచట శబ్దశక్తి మూలధ్వని యగును. ఇట్టి అపూర్వపద ప్రయోగములిందు నెడ నెడ గనిపించుచున్నవి.

మచ్చునకు ఉప్పెన "సంచారాద్రి" యని కల్పితోపమ చక్కగా నిరూపించి, పూర్వము రెక్కలతో సంచరించు పర్వత ములు ఊళ్లను ధ్వంసము చేసినట్లు ఉప్పెన గూడ గ్రామనాశము చేసెనను అర్థశక్తిమూలధ్వని యిచట గోచరించి యున్నది. ఇందు ఝంఝూ మారుతము- అంతట గూడ హృదయ విదారక మగు బీభత్సరసానుభూతి, చదువువారికీ, శ్రోతలకు గలిగి, అది వాస్తవజుగుప్సావహముగా నుండునట్లు లేఖిని నడిపించిరి నర సింహంగారు. ఈ కావ్యఖండిక. కరుణబీభత్సరస భావములగు శోక - జుగుప్సల భావశబలతా పూర్ణమై యలరారుచున్నది.

"పంచభూతాలలో రెండు వాయు జలము
లేకమై జంటగట్టి బిట్టేచి, పాంచ
భౌతికములగు. ప్రాణుల పంచజనుల
పంచతను బొందజేసెను పాపమేమొ"

అని కవి వ్రాసోయిన పద్యములలో రెండు భూతములే (వాయు జలములు) పెచ్చురేగి, భూమ్యాకాశాగ్నులగు నితర భూతము లతో కలిసిఉత్పన్నములైనపాంచభౌతికములగు ప్రాణులను-పంచ

జనులను– (మనుష్యులను) 'పంచత్వము' (మరణము) నొందించె నన్న చక్కని పదప్రయోగము పొండితీ స్ఫోరకముగా నున్నది.

ఇట్లే, ఉప్పెన 'అప్పునిప్పుల రాక్షసి' యని అప్పు (జలము) ను నిప్పుగా రూపణముచేసి దానికి రాక్షసత్వ కల్పన చేసి క్రూరత్వము ధ్వనింపజేసె నీ కవి. 'జాలిబడిరి......జీవచ్ఛవాలపగిది' యని జాలితో దిగ్భ్రాంతిచెంది నిశ్చలముగా రిచ్చపాటుతో నున్నవారిని 'జీవచ్ఛవాల'తో పోల్చుట అతిసహజమైన స్వభావోక్తిని ఈయుపమధ్వనింపజేసి, అలంకారము చేత అలంకారధ్వని, కవికి తెలియకుండనే స్ఫురించినదా యనునంత సూక్ష్మముగా నున్నది

నిర్జీవులై, నష్టులైనవారి కనుగ్రుడ్లు పైకి భయంకరముగా వెడలి, నలువైపులనువారు పరికించుచున్నారాయను నుత్ప్రేక్షనిచట ధ్వనింపజేసి, చక్కని శబ్ద శక్తి మూలాలంకారమును ధ్వనింపజేసిరి నరసింహంగారు.

ఇట్టి దయనీయ దృశ్యము చూచినప్పుడు మానవమాత్రునకు దుఃఖ సానుభూతులు కలుగుట సాజము. కాబట్టి యెందరో సంఘసేవకులు ముందుకువచ్చి ఆయనాధులకు సేవచేసి వారిని ఆదుకొనిరనుట చేత 'మానవ సేవయే మాధవసేవ' యను గాంధీయ సూక్తి స్మృతికి వచ్చును. ఇచట నివేదన శబ్దము 'మాధవసేవను' ధ్వనింప జేయుచున్నది.

ఈ కంకాళ కావ్యఖండికలో "మహోస్పద - ఉన్మృత్యు జంతూల్బణ - ఆ కాండిక - వాసోగ్రాస - చేటుదక్కు (చేటు మిగులు) జీవచ్ఛవ - పంచత - నూకలునిండుట - గుండెలుపిండి

నట్లు- జర్జరీక - నివేదన - బ్రతుకుదీర్ప" మొదలైన సంస్కృత ఆంధ్రముల పాండితీస్ఫోరక పదములు చక్కని తెలుగు పలుకు బడులు ప్రయుక్తములై యీ ఖండకృతికి అఖండశోభ కలిగించు చున్నవి.

పంచజన దుర్మార్గము

పంచభూతములు ఏకమై యేర్పడిన శరీరములోని పంచ భూతములు ఆయా మహాభూతములలో వేర్వేరుగ కలిసెనని 'భిన్నరూప' పదము స్ఫురింపజేయుచు, సందుచేతనే మరణము నకు 'పంచత్వము' అను పేరు వచ్చినట్లు సూచించుటయేకాక, 'భిన్న' శబ్దమునకు శరీర శైథిల్యమను నర్థమునుగూడ శ్లేష చేత స్ఫురింప జేసినాడీకవి. ఈ సీసములో జీవుడు ప్రతి శరీ రమునందు భిన్నుడుగా నుండునను న్యాయశాస్త్ర సిద్ధాంతమును గోచరింప జేసెను. దీనిచేత జన్మతః పూర్వము అఖండాత్మ స్వరూపుడుగా నున్నజీవుడు, త్రిగుణాత్మక మాయాభిభూతుడై పాంచభౌతిక శరీరము పొందినతోడనే, పారమార్థికత్వము పోయి వ్యావహారిక భేదభావము పొందునను నౌపనిషద సిద్ధాంతమిచ్చట నిరూపితమైనది. మానవులలో భేదభావము కాల్పనికమే యను వాస్తవముగూడ తెలిసినట్లైనది. 'సర్వం సహానామ సార్థక్యము' అనుసీసములో పంచభూతములు శరీరములో ఏయే భాగములుగా నైనవని తెలిపినాడీకవి. జనులకు మహోపకారముచేయు పంచ భూతములు పంచజనుని ఆశ్రయించిన తోడనే మాయ చేత స్వార్థము సృజించునను యదార్థము ఇందు తెలియుచున్నది. 'అలవేదముల నాడు వేదాలలో లేని' అను సీసములలో నీకవి

యైతిహాసికతత్వమును నిరూపించి చదువరుల కన్నుదెరిపించెను. 'అనృతమ్ము సకలార్థసాధకము' అనునీనాటి మానవుల మనః ప్రవృత్తి కన్నులకు గట్టినట్లు చెప్పబడినది.

ప్రాంతీయ భేదాలు, అనుసీసముచేత భారత సమైక్యమును చాటి యీనాటి ప్రజాప్రభుత్వ నీతికి దోహదము నీకవికూర్చెను. 'మనిషి మనిషిని వేరుగా జూచువాడు నరుడు కానేకాడు' అని మనిషిలోని అమానుషత్వమును ఈసడించు భావము నీకవిబల్ల గ్రుద్ది నొక్కి వక్కాణించెను.

"స్వార్థమ్మే పరమార్థమై, యనృతమే సత్యస్వరూపమ్మునై
అర్థమ్మే సకలార్థసాధక మహాయజ్ఞమ్మునై, నిత్యమున్
స్పర్ధాసూయలె నిత్యభోజనముగా, పాపాలె సత్కర్మగా
నిర్ధూతాఖిల మంగళమ్మునగు నీ నిర్దగ్ధ లోకమ్మునన్"

ఈ పద్యమెంత చక్కగా ఈనాటి సమాజ ప్రవర్తనను, మన స్తత్వమును చాటుచున్నదో చూడుడు. ఇందలి ఛందశ్శిల్పమెంత ప్రౌఢమో యిదియంత తత్త్వచోదకముగా నుండి భంగ్యంతరము చేత నేటి సమాజమునకు చక్కని నీతినిబోధించుచున్నది.

కులతత్త్వము 'ఈ సమాజమునెల్ల క్రకచములచేత నిలువుగా నడ్డముగా తరిగి ముక్కలుముక్కలుగా చేసి కలియునవకాశము లేకుండచేసెనని యీ కవి యాక్రోశించి సమాజములోని క్రౌర్య నిర్మూలమునకు కంకణము కట్టినాడనుట యిందు స్పష్టమగుచున్నది. 'ఒకచోట కలవారి' యను సీసములో మానవుల హస్తిమశకాంతరమును స్పష్టపరచి. సమసమాజ నిర్మాణమునకు ఉపదేశము చేసినాడు.

ఈ కావ్యఖండములో నరసింహముగారు 'పర్యాయ - బహిష్కార - పౌరాణికాఖ్యాన - నిదిధ్యాస - ఉత్క్రోశ్య - నిర్ఘాత - నిర్దగ్ధ - మర్మాంతర్గత - చిన్నాభిన్న - దరిద్రాధి గీతి' మొదలగు ప్రౌఢ సంస్కృత పదములు ప్రయోగించి, పాండితీ ప్రౌఢిమకు అద్దము పట్టెను.

అ(హ)రిజనులు

ఈఖండికకు శీర్షికయే వ్యంగ్యార్థద్యోతకముగా నున్నది. 'హరిజన' నామము ఈ శతాబ్దములో మహాత్ముడు పెట్టిన పేరైనను, అనాది కాలమునుండి వారియెడల తదితరులకు గల అరిత్వము నేటికిని పోవకున్నదని యందలి 'అ' కారము ధ్వనింప జేయుచున్నది. నరసింహముగారికి హరిజనుల యెడ హృదయము ద్రవించి అదియే కావ్యరసముగా పరిణతమై పఠితలను రసమయులను చేయుచు దయా వీరరసమైనది. దీనిచేత వీరు స్వయముగా నెంతోకాలము హరిజన సేవ చేసినారని కూడ తోచును. తొలిపద్యములోని 'సమజ' శబ్దము యదార్థము, గవాది పశువులకన్నను, చివరకు ముట్టుకుంటేనే మైలపడెదమనుకున్న శునకముల కన్నగూడ తోడిమానవులను నీచాతి నీచముగా ఈ సమాజము చూచును. ఇప్పటికిని అతినిర్దయతో వారియెడల వ్యవహరించుచున్నది అని ఆక్రోశించుచున్నాడు.

వాస్తవములో, దాదాపు 50 ఏండ్లుగా చూచుచున్నాము. పైవారినుండి క్రిందివారి వరకు మన సమాజములో హరిజనుల పైన రాజకీయముగా అభిమానము నటించుచున్నట్లే కనపడుచున్నది. కాని, వేదికలపై, ఉపన్యాసములు చేయుచు, రచనలు

చేయుచు, 'అస్పృశ్యతను' దుయ్యబట్టువారే కాని, సామాజికముగా వారికి భద్రత కలిగించి వివాహాది సంబంధములు పెట్టుకున్న నాయకులు కనబడుటలేదు. హరిజన నామకరణము చేసిన గాంధీజీ ఒక్కడే వారిని ప్రేమతో దరిజేర్చి తనవారినిగా జేసికొనెను తరువాతి నాయకులలో, దాదాపు అన్ని పార్టీలవారు కూడ, రాజకీయముగా, అధికారికముగా ఔన్నత్యము పొందిన హరిజనులనే ఆదరించుచున్నారు. కాని సామాజికముగా వారిని దరిజేర్చుట లేదు. అటువంటి బూటకపు పలుకులకన్న, ఇతరులే మేలనిపించు చున్నది. అస్పృశ్యతా ప్రచారకులు ఆత్మద్రోహము చేయు చున్నారా యనిపించుచున్నది. నిజముగా సమసమాజ పునర్నిర్మాణమునకు, మరల బుద్ధుడో, గాంధీయో గోపరాజు రామచంద్ర రావువంటి వారో పుట్టినకాని, హరిజనులకు సామాజిక న్యాయము జరగదేమో యనిపించుచున్నది. అట్టి సమసమాజమెన్నడో భారతీయులు చూచునది!

ఈ ఖండికలో తొలితొమ్మిది పద్యములు హరిజనుల ఆక్రోశము వర్ణితము ఇదినూటికి నూరుపాళ్లు సత్యము. కాని, వారి పట్టించుకొనువారు సమాజములో నెందరున్నారు? ఏ కార్యమైనను, స్వయముగా ఆచరించి యితరులకు బోధించినప్పుడే ప్రజలు వినెదరు.

'హింసను హింసచే గెలుచుటెంతయు' అను పద్యమును 'పగయడిగించుటెంతయు శుభంబది లెస్స, యడంగునే పగన్ పగ' యను తిక్కన పద్యమును తలపించుచున్నది.

ఈ పద్యము అతి సహజముగా నడచి చదువువారికి కవి

హృదయావేదనతో బాటు సహజీవన విధాన నిర్ణయము గూడ స్పష్టముగా గోచరించుచున్నది. ఇందు 'అహమ్మతి- అభినిర్యాణము - నా లిముచ్చు' మొదలైన పదములు అభిప్రాయద్యోతకములై, సముచిత రీతిని ప్రయోగింపబడినవి.

## నాయకులు

ఇందు నాయకులకుండవలసిన సద్గుణములన్నియు వేర్వేరుగా సీసములలో నీ కవి పేర్కొని వారికి ఉపదేశము భంగ్యంతరముగా నిచ్చినాడా యనిపించుచున్నది. ఈ సీసములన్నియు నతిసరళ శైలిలో సామాన్యులకు అర్థమగునట్లు రచింపబడినవి. ఇందులోను 'వ్యాసఘట్టము - హేమాద్రిధీరుడు - కర్మసాక్షి - సమీకయోద్ధ - తర్కము - ఆత్మశుద్ధి - భావశుద్ధి - క్రియాశుద్ధి గోముఖవ్యాఘ్రు - చపేట తాడనము' మొదలైన ప్రౌఢ పదములు సార్థకముగానూ, సముచితముగాను ప్రయుక్తములై కృతి శోభను ఇనుమడించుచున్నవి.

బూటకంపు మాటలో 'కంపు' ధ్వనించుచున్నది. 'కర్మభూమి - నేతి బీరకాయ - వట్టి చేతిమూర - పరాన్న భోజనము పర్వతాల్ నెత్తిపై బడినప్పటికిని, వంటి చక్కని పలుకుబడులు తజ్ఞుల మెప్పుబడయుచున్నవి.

'దుర్జనం ప్రథమం వందే' యనుసూక్తిని తలపింపజేయుచు నాయకమ్మన్యులను దూయబట్టు 'సహజీవనము ప్రాణి సహజము' అను సీసము మనోరంజకముగా సాగినది.

## గాంధీజీ

ఈ సీసమునందు మహాత్ముని స్వరూపమును నరసింహము

గారు పరితల కట్టెదుట నిలిపెను. గాంధీజీని చూడని ఆధునికులు గూడ, ఇది చదివి ఆయనను చూచినట్లే యనుభవించు కవితా శిల్పమిందులో నిస్పందేహముగా కూర్చినాడీ కవి గాంధీజీకి గల ప్రపంచ సర్వమానవతా సమత్వము ఈ పద్యము నందు కన్నులకు గట్టినట్లు మూర్తీభూతమైనది.

**వల్లభాయిపటేల్**

పటేలు ధీర గంభీరోదాత్త స్వరూపమీ ఖండికలో వాస్తవముగా చిత్రింపబడినది. పటేలు సమగ్ర జీవిత చరిత్రమంతయు సంగ్రహముగా నీఖండికలో దర్పణములో పర్వతము వలె నిముడింపబడినది. ఇది చదువునప్పుడు నిజముగా పటేలు 'ఉక్కుమనిషి' యనియే ఆయనను చూడనివారనుకొనెదరు ఆయన వజ్ర సంకల్పమువల్లనే దేశీయమహారాజుల సొంతరాజ్యములు యూనియన్‌లో విలీనమయిపోయినవి. ఆయన మాటలు విన్నప్పుడు, చేతలు చూచినప్పుడు, 'నిండుమనమ్ము నవ్యనవనీత సమానము పల్కు దారుణాఖండల శస్త్రతుల్యము' అను నన్నయ పద్యము జ్ఞప్తికి వచ్చుచున్నది. ఆయన వజ్రసంకల్పమే లేకున్నయెడల ఆనాడు హైదరాబాదు రాజ్యమింతదాక నిజామునూజులో నణగి యుండెడిదనుట స్పష్టము. దేశవ్యాప్తముగా స్వాతంత్ర్యలబ్ధి చేకూరినను ఒక సంవత్సరము హైదరాబాదు రాజ్యము అస్వతంత్రముగా స్వయం కల్పిత స్వయం సేవకుల (రజాకారుల) క్రూర హస్తముల క్రింద నలిగితుక్కైనది.

**మధురకవి**

ఇందలి పద్యములు సరళశైలిలో సుందరముగా, సులభ

గ్రాహ్యములుగా సాగినవి. కవిత చదివి ఆకళింపు చేసికొని ఆనందించుటకు చదువరులకు రసగ్రహణనిష్ట. అవసరమను సత్యమును 'మధురకవీ!' యను తొలిపద్యములో తెలిపి తద్విపరీతులైనకుకవులు భేక సమానులని, ఓ కవిరాజహంస! అను పద్యములో స్పష్టముగా నీకవి తెలిపెను. నరసింహంగారి హృదయము కవిహృదయము గాబట్టి దీనిని స్వానుభవపూర్వకముగా నిందు చిత్రించెను. కవి బహుముఖ కవితారీతులలో సంచరించవలెనని. 'ఒకవంక నకలంక సుకవితా సంపుటల్' అను సీసములో ప్రసాదగుణభూయిష్టముగా తెలిపినాడీకవి వతంసుడు. సుకవి 'సర్వకళ్యాణ గుణనిధి' యని సర్వజనులకు మంగళాశాసన జీవితము గడుపువాడనియు ప్రశంసించి, యట్టికవిని మహాత్ముల యాశీః పాత్రునిగా దీవించి సుకవుల యెడకవియైన తనకు గల యభిమానమును చూపినాడు డా॥ నరసింహంగారు.

ఈ ఖండికలో 'విబుధ సూరి' యని రెండుసమానార్థక శబ్దములను అన్వర్థముగావాడి తనకు, చదువరులకు, కర్ణపేయము చేసె నీ కవి. 'వైదగ్ధ్య - పండిత సఖుడు - మహాదాశీస్సు' అను ప్రౌఢ సంస్కృత పదములిందెంతయో సార్థకతను గూర్చుచున్నవి.

## మృత్యుంజయులు

'శివునాజ్ఞలేక చీమగూడ కుట్టదు' అను సూక్తిని ఈపద్యద్వయము ధ్రువపరచుచున్నది. సాధారణముగా లోకములో విమానము కూలగా బ్రతికిన వారుఅరుదు. అట్లుండియు మన నాయకులు అధికారులు, మృత్యువుతప్పి బయటపడినందువలన,

వారు 'మృత్యుంజయులు! కాక యేమయ్యెదరు? ఈ మృత్యుంజయ శబ్దము అభంగశ్లిష్టమై ఏకవృంతగత పుష్పద్వయము' వలె ప్రకృతా ప్రకృతార్థములను ఈ నాయకులు మృత్యువును జయించిన వారని వీరు మృత్యుంజయ (శివ) సమానులనియు ప్రకృతా ప్రకృత శ్లేష ప్రయోగించి తజ్ఞులమెప్పువడసి నాడీ కవి.

ఇందులో 'హర్ష - భయ - అహంకార' భావత్రయము కలలితమై మనోరంజకముగా నున్నది. వాయవ్యయానము అని చక్కని పదమిచట ప్రయుక్తమైనది.

అమ్మ

'తల్లిని మించినట్టి పరదైవము లేదు'- 'నమాతుః పర దైవతం' అను నేకార్థములైన సంస్కృతాంధ్రసూక్తులు ఆయదార్థము లెన్నటికిని కావని 'అమ్మ' పద్యము ఋజువు చేసినది.

ఈ పద్యములో చెప్పబడిన మధుర పదార్థములతోపాటు మనకు లభించని దివ్యామృతము చేర్చి. దేవుని కారుణ్యామృతముతో మేళవించి జుర్రినను, అమ్మ పదములోని మాధుర్యమునకు ఈడుకావనుట స్పష్టము. ఈ పద్యములో అనుక్తమైన భావ మాధుర్యము గూడ ధ్వనితమై 'మన ఆనందము' గూర్చుచున్నది.

ముక్కోణపు సందేశం

నరసింహంగారు సవ్యసాచియై, రెండంచుల కత్తివలె నిటు ఛందః కవిత్వము-ఆటుగేయకవిత్వము మధురముగా వ్రాయగలరని యీ గేయనాటిక చాటుచున్నది. ఛందః కవితలో కవితాలక్షణము లన్ని పాటించినవాడు గాబట్టి, గేయములో అలవాటు ప్రకారం

'యతి'ని మానజాలక, కవికి తెలియకుండనే యతులు వాడ బడినవా యనునంత సహజముగా నున్నవీ గేయములోని యతి ప్రాసలు. ఆధునిక కవితాశైలి గాబట్టి ఆధునిక విషయములైన 'వాసెక్టమి' మొదలగు సంతాన నిరోధకోపాయములను గూర్చి ముచ్చటించుట జరిగినది. 'ముక్కోణపు సందేశ' మని సార్థక నామము పెట్టినాడీ కవి.

తొమ్మిది విషయములతో 'నవరత్నహారము' వలె దీనిని గూర్చి సరసహృదయుడును సంస్కృత పారశీక పండితుడును అయిన శ్రీ మాచేటి రామప్ప కంఠము నందలంకరించి అంకిత మిచ్చుట యీ కవి ఉచితజ్ఞతను తెలుపుచున్నది.

ఈ కృతిలో నెడనెడ దొరలిన ఛందో వ్యాకరణముల దొసగులు 'గచ్ఛతః స్ఖలన'ములు

క॥ విద్వాంసుండై జగతిని
విద్వత్కవితా ప్రభావ విలసితుడగుచున్
సద్విద్యా లహరీ సం
పద్విఖ్యాతుడు నృసింహపండితు డలరన్.

క॥ పాశ్చాత్య - ప్రాచ్యసువై
పశ్చిత్య విభాసితుండు భావరస కళా
సిశ్చిత తత్త్వం 'దంతటి'
నిశ్చల మానస 'నృసింహ' నిపుణుండలరన్.

— కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

# [కం] కాళరాత్రి

ఆదియొక దుర్దినమ్ము జనతా సు చయమ్ము సమూలమున్ మహా
స్యద పవమాన విద్ధమయి యభ్రము చేర, ఘనాఘనమ్ములా
యదనున ఝుంఝులందవిలి యత్యధికమ్మగు శీతధారలన్
కదనము చేసి తత్తనునికాయము జేసెను ముంచుముద్దలన్.

పారావార మవారితమ్మగు మహోవాతాహతోత్తుంగ భం
గారావోద్ధత ఘోరమై లులితమై కల్లోలమై ఉచ్ఛ్రితా
కారా భీల విలోల ఘూర్ణిత ధరా కారమ్ము తోయమ్ము సం
చారాద్రిన్ పురుడించు చుప్పెనపడెన్ సంద్రంపు తీరమ్మునన్

అవగాఢాఖిల పార్శ్వభూమిమయమై ఆకస్మికోన్మృత్యు సం
భవితాసంభవ సాధ్వసాహత సజీవానేక జంతూల్బమై
అవదీర్ణాఖిల సస్యవృక్ష మయమై ఆకాశసంకాశనీ
రవమై గోచరమయ్యె తీర మట నీరాకారధన్యాకృతిన్.

పండిన జీవితమ్ము, లటు పండిన చేలు, సదార పుత్రులున్
ఉండిన యిండ్లు, దాచినధనోత్కరమున్, ప్రియబంధుకోటితో
మండితమైన జీవన మమాంతము మాయము చేసి వైచె ఆ
కాండిక మృత్యురూప జలకాండము ఉప్పెన రూపధారియై

ఎటుజూచినన్నీరు అటు సాగరమ్ముగా
మిట్టపల్లాలు లోతట్టుగాగ
నీరు తగ్గినచోట నీచు వాసన చిమ్మ
నాసికా పుటములు గాసినొంద

చావగా మిగిలిన జీవరాశికి రక్ష
లేక వాసోగ్రాస క్లేశ మొదవ
సన్నసూదులు గ్రుచ్చుకొన్నట్లు శీత వా
తాహతి గాత్రముల్ తల్లడిల్ల

ఎంత చింతించినన్ గూడ సుంతయైన
దారి కానంగరాక విదారితాతి
దుఃఖ భరమగు హృదయాలతోడ ప్రాణి
కోటి నిర్వేదమును పొంది చేటు దక్కె

ఏతట్టు చూచినన్  ఆ తట్టు పీనుగు
పెంటలే ఘోరమై కంటబడును
ఏ చాయ పరికింప నా చాయ జంతు కం
కాళాలు కుప్పలై కాను పించు
ఏ వంక జూచినన్ ఆవంక సస్యార్థ్య
కుంభిని పంకమై గోచరించు
ఏ దిక్కు చూచినన్ ఏడుపుల్ పెడబొబ్బ
లై చూపరుల గుండె లవియ జేయు

పంచ భూతాలలో రెండు వాయు జలము
లేకమై జంటగట్టి బిర్రేచి పాంచ
భౌతికములగు ప్రాణుల పంచజనుల
పంచతను బొంద జేసెను పాపమేమొ

నిన్ననే గద కన్నె వన్నె చిన్నెల దోగి
మల్లెలై తావుల జల్లి తనిసె
నిన్ననే యాకన్నె కన్నుల విందుగా
పెండ్లికూతురు కలల్ పెండ్లి గనియె
నిన్ననే ఒప్పులకన్నె తీరుంగాంచి
వరుడు రసానంద వశత నొందె
మొన్ననే యాతల్లి చిన్ని కందును గాంచి
నోముల పంటంచు నుడివి తనిసె

పచ్చిగుడ్డని తలపక, బాలవృద్ధ
వయసులెంచక, జంటల వలపులనక
అప్పు నిప్పుల రాక్షసి ఉప్పెనగుచు
నోరు విప్పుచు కబళించె నూళ్ల నూళ్ల.

తల్లి గానక పిల్లలు తల్లడిలగ
భర్త గానక భార్యదుఃఖార్తి గ్రుంగ
తోడు నీడయు లేక సైదోడు లేక
తల్లడిల్లెను ప్రాణి సంతానమంత

బ్రితికి నన్నాళ్ళ నే గొప్ప, వాడు తక్కు-
వంచు స్వార్థాన మూర్ఖంపు బ్రతుకు బ్రతికి
వర్ణ కుల భేదముల నెంచవలదటంచు
బుద్ధిగా మాల, మాదిగ, బోయ, కాపు,
కమ్మ, బ్రాహ్మణ, రెడ్డి , కైకాల, బలిజ
శవము లొకదానిపై నొకటి చక్క-నొరిగె.

బురద గూరిన పీనుగుల్ మురుగు కంపు
కొట్టి ముక్కులు తట్టు కోనట్టు గాగ
మృత్యువాసనలే పీల్చి మిగత జనులు
జాల్బడి రెల్ల జీవచ్ఛవాల పగిది.

ఏనాటి బంధమో ఈనాటితోపోయె
గా యంచు దిగులొందు కాంతులచట
ఇకపైన నా భాగ్యమేమి గానున్నదో
యంచు లబలబలాడు నబల లచట
ఇంతలోనే యెంత వింత వెన్నాడెనో
యని దిగులొందెడి యతివలచట
నేలపై నూకలు నిండెనా యని యేడ్చి
తల బాదుకొనియెడి తల్లులచట

ఎచట జూచిన నచ్చోట నెగుచు నెగుచు
నంగ లార్పులు పెడబొబ్బ లక్కసముల
ఆర్తనాదా లహీన హా హా రవాలు
పిక్కటిల్లెను గుండెలు పిండినట్లు.

నీరసాకారులై నిర్జీవ దృష్టితో
నలుగడల్ పరికించు నష్టులచట
దిక్కుతోచని విపత్తిని, శూన్య దృష్టితో
నిశ్చేష్టగాజూచు నిసుగులచట
వాయు తాడిత జలావర్తమ్ము నుండి పు
నర్జన్మ గన్నట్టి నగ్నులచట
ఝంఝామరుద్ధూత జర్జరీక శరీరు
లై భూపతితులై దిగంబరులట

ఎంత వరకు దిగంతాలు అంతరిక్ష
మెంత దూరమ్ము సాగునో అంత వట్టు
నిర్మనస్కమ్ము శూన్యమ్ము నిశ్చలమ్ము
లైనచూపులతో నెల్ల గానబడిరి.

ఈ దయనీయ దృశ్యము లనేకము జూచి హతాశులౌచు ని
ర్వేదము బొందియున్న ప్రజరీతిని జూచి సమాజసేవకుల్
ఆదుకొనంగ ముందరికి అర్థము, వస్త్రము, కోట్లు కోట్లుగా
వేదన బాప బంపిరి నివేదనగా పలు దేశ వాసులున్.

దేశవాసుల కష్టాలు, దిక్కులేని
బ్రదుకు గాంచిన సంఘ సేవకులు, రాజ
ఋషులు, యువకులు, సత్కళా పోషకులును
బయలు దేరిరి వారల బ్రదుకు దీర్ప.

# పంచజన దుర్మార్గము

పాంచ భౌతికమైన ప్రాణికోటి సమస్త
మేలొకో భిన్నరూపాలు పొందె

పరమాత్మ జన్య జీవాత్మ సర్వస్వ
మ్మదెందుకో భిన్నత్వమంది నిండె

జన్మమృత్యువులు సాజమ్ములౌ భూతసం
ఘాతమ్మదేల స్వార్థమ్ము నందె

ఆహారభయనిద్రలందు సామ్యము నొందు
జనుల నీర్ష్యయదేల జన్మమందె

ఎంత చిత్రమ్మొ మాతృగర్భాంతరమున
నెలలు తొమ్మిది మాత్రమే నివసముండి
నేలపై కన్నుదెరచి యీ నీరు గాలి
నింగి తేజస్సు మట్టినే త్రాగి బ్రదుకు
నరుడు భేదమ్ము పాటింప నగవుగాదె

సర్వంసహా నామ సార్థక్యము వహించు
పృథ్వియీనరుని శరీరమయ్యె
ప్రాణశబ్దమునకు పర్యాయ భూతమ్ము
వాయువీనరునికి ప్రాణమయ్యె

ప్రాణధారణకునై ప్రముఖ పదార్థమౌ
నీర మీనరునకు నెత్తురయ్యె
ఉష్ణరూపమ్ము కవోష్ణ విద్యుద్రూప
దీపమై నరునిలో దీప్తమయ్యె

అండబ్రహ్మాండాల కాధారభూత ఆ
కాశమ్ము లో నవకాశమయ్యె

తాదృశమ్ములు పంచభూతాలు ఒక్క
టొక్కటే మానవునకు మహోపకారు
లట్టి భూతమ్ములొక్కటైనట్టి పంచ
జనుడు భిన్నుడై స్వార్థియైమనుట వింత!

ఆల వేదములనాడు ఆర్యాభినిర్యాణ
ఫలము అనార్యుల వధలు బలిసె

ఆలవర్ణ ధర్మమ్ము తొలినా దనార్యులు
బానిస బ్రదుకులు బ్రదుకవలసె

బౌద్ధధర్మపు సామ్యవాదమ్ము కులతత్వ
నిర్మూలనకు గాక నేలకొఱగె

వర్ణ ధర్మము కట్టుబాటు తప్పిన వార
లందరు శిక్షల పొందవలసె

వారు గ్రామాలలో బహిష్కార మంది
అంటరాని తనమ్మున అటమటించి
అనదలై జ్ఞానదూరులై అన్నవస్త్ర
హీనులై హింసితులయి రహీనగతిని

వేదాలలోలేని వేర్పాటు ధోరణి
ప్రజలలో నేరీతి వ్యాప్తినందె
ఉపనిషత్తులలేని ఉన్మత్తధోరణి
పంచజనుల నెట్లు ప్రబలమందె
సాంఖ్యమ్ములో, తర్క శాస్త్రమ్ములో చెప్ప
బడినరీతిగ సమత ప్రబలదేలా?
స్మృతులలో శాస్త్రిలగతులలో పౌరాణి
కాఖ్యానములె ఖ్యాతినందెనేలా

జైనబౌద్ధమతాలలో బుద్ధిమంతు
లెందరో త్యాగులగుచు యోగీంద్రులగుచు
సర్వమానవ సమతను చాటి బోధ
చేసినను చావదేల యీ చెడ్డనీతి?

స్వార్థమే పరమార్థ సత్యమై యనృతమ్మె
సకలార్థ సాధకాచారమయ్యె
స్పర్ధలే ఆక్రమ శ్రద్ధలే పరభోజ
నాసక్తియే నిదిధ్యాసమయ్యె
దౌర్జన్యమే పీడితక్లేశమే నిత్య
నైమిత్తికమ్మైన కామమయ్యె.
పనిచేయకుండనే ఘనకీర్తి ఇష్ట మి
ష్టాన్న భోజనములే ఆటయయ్యె

బుద్ధిబలమును గలిగి సమృద్ధ బాహు
బలము పగ్గాలచే బిగబట్టి కోటి
దీన బలహీన జనులను బానిసలుగ
చేసివైచెను కులతత్వ చేష్ట భళిరె!

ప్రాంతీయ భేదాలు భారతీయైకతా
భంగ కారణములై పరిఢవిల్లె

భాషా విభేదాలు భావైక్య శక్తులం
దరలించి దూరాన తరిమివైచె

జాతి విద్వేషాలు జాత్యైకమత్య శ
క్తికి పరశ్వధములై తీరి బలిసె

వర్ణ విద్వేషాలు వర్ణ భేదముగాక
కులరూపముల నిల్చి కుళ్ళిబలిసె

ఏవమాది విభేద సంభావనముల
సర్వ మానవ హృదయాలసహ్యగర్హ
వైరితేర్ష్యాది దుర్గుణ వర్ధనములు
గా పరిణమించి సంఘ ముత్కాపిర్యమయ్యె.

ఒకనితల్లి తొమ్మి, దొకని తల్లి పదాఱు
నెలలు మోయునేమి నియతి దప్పి
మనిషి నుండి మనిషి మరివేరుగా జూచు
వాడునరుడు కానెకాడు కాడు.

స్వార్థమ్మే పరమార్థమై యనృతమే సత్యస్వరూపమ్మునై
అర్థమ్మే సకలార్థ సాధక మహాయజ్ఞమ్మునై నిత్యమున్
స్పర్థాసూయలె నిత్య భోజనముగా పాపాలె సత్కర్మగా
నిర్ధూతాఖిల మంగళమ్ము నగునీ నిర్దగ్ధ లోకమ్మునన్.

దుర్మార్గమ్మున స్వార్థ మానవులు దుర్దోషాత్ములై నింద్యదు
ష్కర్మాచార పరాయణాత్ములగుచున్ కాయ స్పృహన్కాయక
ష్టోర్మిన్ సై పగలేని సోమరితన మ్ముద్వేలమై పార దు
ర్ధర్మాంతర్హిత బుద్ధి, సంఘమును ఛిన్నాభిన్నముం జేయరే

ఈ సమాజమునెల్లను నెన్నొ క్రకచ
ములను నిలువున మరి నడ్డముగను దరిగి
ఎడ పెడగవైచి కలియనీకుండ జేయ
మహిత జాతీయ భావమ్ము మంటగలిసె,

ఒకచోట కలవారి పికనాద సమగీతి
ఆప్రక్కనే దరిద్రాధిగీతి
ఒకచెంత నధికార హుంకారరావమ్ము
లాదారినే దీనరోదనములు
ఒకవంక కులశాపయుత గర్వపారుష్య
మా వంక నస్పృశ్యతా విలాప
మొకప్రక్క ముక్కిడిమూకల దౌర్జన్య
మా ప్రక్కనే పీడితానుయోగ

మీవిధ ద్వంద్వ సమ్మిశ్రితా విధాన
మీవిష స్వార్థ కలిత దుర్వహ కునీతి
చెల్లరాదింక యీ నేలనెల్ల సమ స
మాజ నిర్మాణ మత్యంత మవసరమ్ము.

# అ(హ)రిజనులు

సమజముకంటె నీచముగ సంఘము చేత తిరస్కృతుల్ సమా
జమున ననేకులైన హరిజన్ములు భారత పాలనా ప్రభా
వమున ననేక విద్యల నవారిత ధోరణి నేర్చి నేత్రముల్
క్రమమున విచ్చి రెచ్చి ప్రతిఘాతన భావము దండడింపగన్

ఎవడురా వాడు మమ్మింత చివరిదాక
తరిమి తరిమి హృదంతరాంతరము లందు
దహన కీలల దరికొల్పి తనను తాను
దగ్ధ మొనరించు కోజూచు దానవుండు?

తలచు కొన్నప్పుడెల్ల డెందమ్ము కోప
తప్తమై ప్రతికార పృదాకు కోప
ఘూర్ణమాన స్వరూపమై ఘోర విశస
నత్వ తత్వమ్మున పురోహితత్వమొందు.

మేము త్రవ్విన బావులు మామకీన
ఘర్మ ఫలితాలు మాత్రమే కావు సర్వ
విధసముచ్ఛిష్ట భరితాలు వీని నీరు
త్రాగుచునె మమ్ము మాత్రము తాకనీరు.

సర్వ మలమూత్ర కంకాళ సంశ్రితములు
ఉర్వరమ్ముల సర్వ సస్యోర్జితముల
చేసి పండింప సొంతము చేసికొంచు
నంజి కుడుచుచు మాకీరు గంజినీరు.

మేము కట్టిన భవనాలు మామకీన
రక్త ఘర్మ సంజాత వాస్సిక్త ఫలము
లన్నిటిని ఆక్రమించి మీరనుభవించి
కూల ద్రోసినారలు మమ్ము గుడిసెలందు

మేము కట్టిన ప్రాజెక్టు మేముకట్టి
నట్టి ఫ్యాక్టరీల ఫలము నాలిముచ్చు
లగుచు దోచుక దాచుక అనుభవించు
కొంచు ముంచిరి దారిద్ర్యకూపమందు.

మాకు పుట్టిన కొడుకులు మామకీన
కష్టఫలితాలు జన్మహక్కయిన యట్లు
కుడుచు రీతిని మీరెల్ల కుడిచి కుడిచి
రొమ్ము గ్రుద్దిన రీతిని క్రుమ్మినారు.

తరతరాలుగ దాస్యమ్ము దారితెన్ను
కానగారాని అంధ కారాన మమ్ము
ముంచి పైపెత్తనము చలాయించినారు
చెల్లె రోజులు ఇకదారి వల్లకాడె.

అనుచున్ తాపము హెచ్చి హెచ్చి హృదయం బామూలమున్ దీవ్రమై
కనలన్ నేత్రము లగ్ని గోళములుగా గాంక్రింప నుగ్రాత్ములో
యనగన్ భీకర మూర్తులై నిలువ నత్యంతమ్ము నభ్యంతర
మ్మును నొ ఆత్మ పదార్థ మీ విధముగా మూలాత్మ ఘోషమ్ముగా

హింసను హింసచే గెలుచు టెంతయు ప్రాకృతమైన సత్యమౌ
హింస నహింసచే గెలుచు టెంతయు మానవతాయుతమ్ము ప్ర
ధ్వంసిత మానుషం బయిన ధారుణి వాస మయోగ్య మౌ సదా
సంస్కృతి సాగు కోసము ప్రశాంతియె ధారుణి నేలగావలెన్.

అనుచు నశరీరవాణి తదంతరాత్మ
ఘోషణమ్ముగ శ్రుతులందు ఘూర్ణితమయి
మేధ జొచ్చి యహంమతి నాధి నణప
దీప్త సహజీవనమువైపు దృష్టి మరలె.

# నాయకుడు

పర్వతాల్ నెత్తిపై పడినప్పటికి గూడ
పదరని గుండె నిబ్బరపువాడు
కు విమర్శకారు లొక్కుమ్మడిగా దాడి
చేయగా తొలగక చీలువాడు
వ్యాసఘట్టము వంటి వ్యవహారములు గూడ
నవలీలగా తేల్చునట్టివాడు
హింసింపబడు దృశ్యమేదైన కన్నీరు
మున్నీరుగా నేడ్చు పిన్నవాడు

అతడె హేమాద్రిధీరు డజేయమైన
చేతనాశక్తి, మేధా, దయాతిరేక
కలితహృదయుడు జనముల కర్మసాక్షి
న్యాయపాలుండు సార్థకనాయకుండు.

పరధన స్పర్శమ్ము పాపమ్ముగా హేయ
తాపమ్ముగా బుద్ధి తలచువాడు
పరనారి గమనమ్ము పరిభావపారుష్య
మని దూరముగ పారి, మనెడివాడు
అన్యభోజనమున్ పరాన్నభోజనముగా
నెంచి స్వార్జితమే భుజించువాడు
అన్నార్త జనదైన్య హరణోద్యమ సమీక
యోద్ధగా మున్ముందు నుండువాడు

అతడె జనముల దుఃఖార్తి నపనయింప
శక్తిగలవాడు, శీలానురక్తి పరుడు
స్వార్థరాహిత్యమే పరమార్థమైన
నడతగలవాడు సార్థక నాయకుండు.

ప్రాస్వదృష్టికి మూలమైజాతి సర్వస్వ
మును ప్రాస్వమును జేయునట్టి మతము
తర్కమ్ము కు హేతు తత్వమ్ము నకు దూర
మై జాతివిభవించు నట్టికులము
తలిదండ్రులను అన్నదమ్ములసైతమ్ము
వైరిత్వ నరకాన వైచుధనము
స్వార్థాన పరభోజనార్థ కల్పితమైన
జానిసత్వము అంటరానితనము

దోషభూయిష్టమైన పైదోషములకు
నిత్య నిలయమ్ములై ఐకమత్యమునకు
దూరమై చిన్నభిన్నమై తునియలయిన
నరుల కేకత ఘటియింప నడుముగట్టు
నట్టివాడె కా సార్థకనాయకుండు.

సామ్యవాదము ప్రజాస్వామ్యమ్ము క్షేమమ్ము
చేయరాదుగ "వట్టి చేలిమూర"
సంక్షేమ రాజ్యమ్ము సమదృష్టి న్యాయమ్ము
కారాదుగా "నేతిబీరకాయ"
"దున్నువానిది భూమి ఉన్నవానిది యిల్లు
కారాదుగా "బూటకంపుమాట"
పైన పటారమ్ము లోనలొటారమ్ము
గానుండరాదుగా "కర్మభూమి"

అనుచు భావించి పూర్ణమౌ ఆత్మశుద్ధి
భావశుద్ధి క్రియాశుద్ధి వైపు బుద్ధి
చొనిపి సార్థక జీవితమును వరించు
నట్టివాడెపో సార్థకనాయకుండు,

సహజీవనము ప్రాణి సహజమ్ము తద్విఘా
తక నాయకమ్మన్యులకు నమస్సు

సామరస్యము ఉత్తమము దానిననుసరిం
పనినాయకులకివె వందనములు

మానవత్వము సర్వమాన్యమౌ భూషమ్ము
తద్విరోధులకు వందనశతములు

ఉత్తమత్వము ఉన్నతత్వమ్ము తద్విఘా
తకులకు దండాలు దశ శతములు

నేటి భారత సంఘాన నేతిబీర
కాయలేగాదు పులితోలుకప్పుకున్న
గాడిదలు గోముఖ వ్యాఘ్రగణములెల్ల
జక్కచేయగ సింహగర్జనము వలయు
కనలు సింహచపేటతాడనము వలయు

# వల్లభాయి పటేల్

ఆగాంధీ మహనీయ సంధితమునై యాచంద్రతారార్క శో
భాగాథమ్మునునై యహీనఫల సంభారమ్మునై స్వాంతమున్
ఊగాడించెడి మోహనమ్మగు నహింసోదగ్ర సత్యాగ్రహా
భోగమ్మందున మున్గి యెంచిరదియే భూపత్వ సంసిద్ధిగాన్.

అందరిలోన గొందరు మహామహనీయులు అందులోననే
కొందరొ జాతిసేవకులు. కొందరు నేతలు అందులోననే
కొందఱొ స్వార్థతారహిత కుందనమూర్తులు. ధైర్యచిత్తులా
కొందఱిలోన గణ్యగుణ కుంజరుడొక్క పటేలు భాయియే

వేసవేల్ రాబడి పీడి సత్యాగ్రహో
ద్యమమున దూకిన త్యాగధనుడు
బాధితాహమ్మదాబాదు మిల్లుల కార్మి
కుల బాధ పైవేసికొన్న ఘనుడు
పంజాబునందు సంజాత మారణహోమ
మును జూచి యుద్రిక్తుడైన శివుడు
బోర్సాదునన్ బందిపోట్లపై సత్యాగ్ర
హము చేసి గెల్చిన హత హృదయుడు
బార్డోలి నాగపూర్ పన్నుల సత్యాగ్ర
హమున గెల్చినయట్టి యమృతసముడు

దండి సత్యాగ్రహమ్మున దండనాయ
కాగ్ర సరుడయి సత్యాగ్రహానుచరుల
విచలితులుగాక సంయమి వీరవరుల
గాగజేసిన వజ్ర సంకల్పుడతడు

ఆస్వాతంత్ర్యములోన మ్రగ్గి హృదయం బామూలమున్ గ్రుంగగా
న స్వాతంత్ర్యములోన మ్రగ్గెడి మనుష్యాకారులం జూచినన్
అస్వప్నామల సానుభూతి గురియున్నబ్దమ్ము రీతిన్ పటేల్
భాస్వద్రూపముతోడ దాస్యమిహికన్ భావించు పంచత్వమున్.

ప్రణుతింబొందిన శౌర్యధైర్యగుణ సంపన్నుండు నాపన్నులన్
దనయట్టుల్ సమతా దయాదరమున్ తన్పున్ మహా శాత్రవున్
గనినన్ స్నేహితునట్ల జూచు, మనసున్ కారుణ్య భావాంబరా
ఘనమై యొప్పును గాంధి సేవనమునన్ కాఠిన్యదూరస్థుడై.

వంగిన వాని క్రిందికిని వంగన నిష్ఫలమౌట సత్యమౌ
ఆంగల పాలనమ్మునకు నత్యధికమ్ము విధేయమైన రా
జ్యాంగము గల్గి పాలితుల యర్థము దోచు జమీనుదార్లకున్
శృంగము భంగమున్ కలుగజేసి విలీనముచేసె రాజ్యముల్

ఉక్కు మనిషిగ పేరొంది చెక్కుచెదర
కుండు నెప్పుడు చిరులనవ్వు చూడలేని
వజ్ర సంకల్ప ముఖముతో వఱలుగాని
అంతరంగమ్ము నవనీత సుందరమ్ము.

# మధురకవి

మధురకవీ! భవన్మధుర మంజుల మంగళభావనాఝరీ
సుధల, నమందకౌతుక విశుద్ధ మనస్కులు, సారభూత ధీ
నిధులు, సదా రసగ్రహణనిష్ఠులు, ధూత కళంక మానసుల్
ప్రధిత కవీశ్వరుల్, సతము పాఠ్యముగా భజియింతు రెప్పుడున్.

ఓ కవిరాజహంస! భవదూర్జిత కావ్యమహోను భావముల్
మా కవిలోక హృజ్జలజ మానస చోరమరీచి పుంజముల్
భేక సమానులౌ కుకవి బృంద హృదంతర తీవ్రవేదనా
శోక నిధానముల్, విబుధ సూరిజనా కి కర్ణపేయముల్.

ఒకవంక నకలంక సుకవితా సంపుటుల్
రచియింతు వుద్దండ రక్తితోడ
ఒకవైపు మనవైపునకలట్టి కథలిట్టె
రచియింతు నవలలై రమణమీర
ఒకసారి మనసార పికగేయ సరణిగా
రచియింతు గేయాల ఖచరఖేల
ఒకతేప పరితాప వికసితోత్థిత రీతి
రచియింతు గీతాల రసిత ఫణితి

వివిధరీతుల వైదగ్ధ్య విలసితముగ
రచన సాగించుచు న్నిత్య శుచిపథాన
జీవయాత్రనజేయ విశేష రీతి
సల్పుచుండుము పండితసఖుడవీవు

సర్వ కళ్యాణ గుణనిధి సర్వకాల
సర్వజనులకు మంగ ళాశాసనముగ
జీవితమ్మును సాగించి చేవగొనుము
అందుకై మహదాశీస్సు లందుకొనుము

# మృత్యుంజయులు

ఔరా యెంతటి హర్ష భైరవ భయాహంపూర్వికా భావసం
భారాయామ సువార్త వీనులబడెన్, వాయవ్యమౌ యానమున్
ఘోరమ్మైన ప్రమాద గోచరమునై కుంఠమ్మునై అగ్నికీ
లారాటమ్మున నుండ దూకిరి పౌలాలన్ ముఖ్యమంత్ర్యాదులున్

ఐ జే నాయుడు రామమూర్తి యుతుడై ఐ.జి.పి. నారాయణుం
డాజైత్రమ్మున చెన్నరెడ్డికిని తోడై నీడయై రక్షణగా
నై జేతవ్యముజేసి మృత్యువును ఉద్యత్ వర్త్మలో ద్రోయగా
నాజోఘుష్యములయ్యె నాంధ్ర జనతా నందాబ్ధి నందమ్ములున్.

# అమ్మ

పనసతొనల్ మరందమును, పాలును, చెక్కెర, నేయి, పీగడల్
పనుపడ మేళవించి, కడుపారగ జుఱ్ఱిగ నాత్మ కెంత యిం
పును గలిగించు, దానికి నపూర్వము, వందల కోట్ల రేట్ల తీ
పును గల దమ్మయన్ బలుకు పువ్వుల గుత్తుల మెత్తనైనదై

# ముక్కోణపు సందేశం

## (గేయ నాటిక)

భూదేవీ పురస్కృతులు
పుంభావ సరస్వతులు
కావ్యకారులైన ఋషులు
కైలాసం పరుగిడిరీ

ప్రథమ దంపతులు గౌరీ
పరమేశుల అడుగులబడి
ప్రణుతింపగ సాగినారు
ప్రార్థింపగ సాగినారు.

శంభో! స్వయంభూ! మహేశా! గిరీశా! మహాకాల!
మృత్యుంజయా! భూత సంరక్షణాయత్త చిత్తా! మహాతత్వరూపా!
విరూపాక్ష!దక్షాధ్వరధ్వంసకా!సర్వసంసారరక్షా మహాకార్యధుర్యా!
శివా! అర్ధనారీశ్వరా! ప్రాణికోటీ సమత్వ ప్రదాతా!
సమస్తామరాదైత్య సంసేవ్య పాదారవిందా! సదానంద.
సంపూర్ణ చిత్తైక విత్తా! జనానంద సంధాయకా!
జన్మ పంచత్వ నిర్ణాయకా! దేవదేవా నమస్తే నమస్తే నమః

పితరులార ఆదిమ దం
పతులారా పాహిపాహి
పశుపతి ఓ లయకారీ
పాతుపాతు మాంపాతు

అనగానే పరమేశుడు
అభయ హస్తుడై యిట్లనె

భూదేవీ ! ఋషులారా !
భూభారం పెరిగినదా ?
భూపాపం పెరిగినదా ?
ఏమైనది ? ఏమైనది ?

కాటుక కన్నీరు కార
కరుణతో భూదేవి పలికె

భూభారం వహియింపగ
భూపాపం భరియింపగ
ప్రభో నాకు శక్తి లేదు
పరమాత్మా కరుణింపుము

ఏమయ్యా ఋషులారా
ఏమయ్యా కవులారా
యేమి చెప్ప దలచినారు?
యేమి చెప్ప దలచినారు?

పరమేశా యీలోకం
పాపంతో భారంతో

పండి క్రుంగిపోతున్నది
సంరక్షింపుము దేవా!

పూర్వం వలె నేడు గూడ
భూభారం తగ్గింపగ
కలరా, ప్లేగ్, మసూచికం
కల్పిస్తూ వుంటి వీవు
కరువు సృష్టి కదన సృష్టి
చేస్తూనే వుంటివీవు

అయినా శాస్త్ర జ్ఞానం
అభివృద్ధిని పొంది పొంది
మృత్యు వాత పడకుండ ఆ
మర్త్యుల చేసేస్తున్నది.

రవాణాల వృద్ధివల్ల
ఆహార ప్రాప్తి వల్ల
కరువు కాటకాల బాధ
కనబడకుండా వున్నది

ఆగ్నేయాస్త్రాల మించు
ఆయుధాల యుద్ధాలలో
ధన నష్టం కలిగినంత
జన నష్టం కాకున్నది

వరణీయులైన వినోద్
వాసెక్టమి, లూప్ వంటి
నివారణోపాయాలను
నిస్తరించి పోతున్నది

కూటికి కరువైనయట్టి
ఆట పిల్లలను చూచి
గుడ్డకు కరవైన బీద
బిడ్డల మానముల తలచి

విద్యకు కరవైన పేద
పిల్లల జీవితము తలచి
పదిగూడా నిండని పసి
బాలల దాస్యమ్ము చూచి

మాతృ రూపు దాల్చినట్టి
ప్రజా ప్రభుత బాధ్యతతో
పారితోషికముల గూడ
ప్రకటించెను నియంత్రణకు
ప్రచారాల సాధనాల
ప్రబలంగా కావించెను

అజ్ఞానం అవివేకం
అసూయేర్ష్య ఫలితంగా
ప్రచారాల ఫలం గూడ
నిష్ఫలమై పోతున్నది

అందులకే భూభారం
అధికం అయిపోతున్నది
తన శాసనములను మించి
జన సాంద్రిత పెరుగుట విని
పరమేశుడు కోపముతో
పరికించెను భూదేవిని
భూదేవీ యింకా యీ
భూభారం యేల పెరిగె
దేవదేవ యీ పాపం
దినదినాభివృద్ధి పొంది
భరియింప నశక్యమైన
భారం అయి కూర్చున్నది
ప్రతి మనిషీ స్వార్థంతో
పరుని మోసగించదలచు
పరుల కష్టఫలం గుడిచి
పనిచేయక యుండ దలచు
దురాక్రమణ చేసి భూము
లాక్రమించుకొన దలచును
బీదలు కామందులైతె
పనికి యెవ్వరని తలచును
ఈ రుషులే నాడును రా
జర్షభులను కలిసినారు
స్వార్థంతో మనిషినుండి
మనిషి వేరు చేసినారు

సోమరులై కాయకష్ట
మేమి లేక బహుజనులను
కొద్దిమంది తమసౌఖ్యం
కోసం బలి చేసినారు

తప్పుడు సూత్రాల నల్లి
తప్పుదారి పెట్టినారు
అజ్ఞానంలోన ముంచి
అనైక్యమ్ము నెరపినారు

గుడ్డి యెద్దు చేనిలోన
పడ్డ రీతి పరంపరగ
మూర్ఖాచారపరాయణ
మూఢాత్ముల చేసినారు

వీరి వాత్రిత ఫలముగ మత
దురహంకారంతో - కుల
దురహంకారంతో - మరి
అస్పృశ్యత జనియించెను

జాతి చీలి చీలి చీలి
వ్యక్తి వ్యక్తి వేర్వేరై
అనైక్యముగ పరిణమించె
అభవా పరిరక్షింపుము

ఈ రుషుల వారసులు
ఈనాటి కవులంత
పాత పాటే పాడి
పాడు చేస్తున్నారు
చేతలకు మాటలకు
చిత్తశుద్ధి హుళక్కి
అందుకే బోధనల
కింత విలవయు లేదు
చెప్పేది శ్రీరంగనీతులూ
దూరేది వేశ్యాగృహములూ
చెప్పేది సమతా ప్రబోధమూ
చేసేది దానికి విరుద్ధమూ
అన్నం బ్రహ్మేతి వ్యజానాత్! అన్నం బహుకుర్వీత!
తద్వ్రంతం! అన్నం ననింద్యాత్! తద్వ్రతం!
అన్నం న పరిచక్షీత! తద్వ్రతం!
అన్నాద్ధ్యూతాని జాయంతే! జాతాన్యన్నేన వర్ధంతే!
అద్యతే త్తి చ భూతాని!
అన్నదానం గొప్పదన్నారూ
అందకుండా దాచుతున్నారూ
పాపమును పండించుతున్నారూ
పాపభారం నింపుతున్నారూ

పాపరచనల చేయు కవులూ
పాపకర్మల చేయు ప్రజలూ
కలిసి సృష్టించేది పాప సంతానం
కాబట్టి కనరాదు ఇంక సంతానం
కనరాదుకనరాదు అధికసంతానం
నీ మాట జవదాటి పండింది పాపం

అనగానే హరుని కనులు
కన కనమని మండసాగె
మొగము జేవురించి అగ్ని
సెగలను కురియింప సాగె

దశమ హస్తమందున్న
డమరుక నినదింపసాగె
కంఠాభరణాహి సము
ద్దండత బుసకొట్టసాగె

అడుగున కైలాసశిఖరి
అదురుచు కంపింప సాగె
తాండవ నృత్యంతో బ్రి
హ్మాండం కంపింప సాగె

మూడవ నేత్రమ్మునుండి
ముచ్చిచ్చులు జ్వాలియించెను
ముక్కోణా కారంలో
వెక్కసమై జ్వలియించెను

పాహి పాహి మాం దేవా
పాతు పాతు మాం దేవా
పితరులార ఆదిమ దం
పతులారా పాహి పాహి
పశుపతి ఓ లయకారీ
పాతు పాతు మాం పాతు

ముక్కోణపు సందేశం
ముల్లోకములందు చాటి
ముచ్చిచ్చుల సందేశం
ముల్లోకములందు చాటి
సర్వజనుల సుఖము కొరకు
పాటు పడెదమో దేవా